





# ఉప వేదాలు

## వివాహం-దాంపత్యం

# హైందవ వివాహము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# హైన్దవ వివాహము


ఆంగ్ల మూలము :

R. M. చల్లా

తెనుగు సేత :

సత్యవోలు శేషగిరిరావు



This book is published with the
Financial Assistance of
Tirumala Tirupati Devasthanams
under the scheme,
"Aid to publish religious books"

# పరిచయము

బహుభాషాభిజ్ఞులు, ప్రసిద్ధ విమర్శకులు శ్రీ ఆర్యమ్ చల్లా గారు ఆంగ్లమున వ్రాసిన Hindu Wedding గ్రంథమునకు ప్రసిద్ధ కవి, సహృదయులు శ్రీ సత్యవోలు శేషగిరిరావు గారి ఆంధ్రానువాదము ఈ హైందవ వివాహము గ్రంథము.

భారతీయ జీవన విధానము సంస్కారవంతమైనది. మన వైదిక వాఙ్మయమున నలుబది యెనిమిది సంస్కారములు వివరించబడినవి. అందు కొన్ని సంస్కరింపబడు వ్యక్తికి మాత్రమే ప్రయోజనమును కలిగించునవి. ఈ వివాహ సంస్కారము వధూవరులకే కాక తద్వంశమునకు, సమాజమునకు కూడ ప్రయోజనకరము. గృహస్థాశ్రమము అన్ని ఆశ్రమములలో అత్యంత ప్రధానము. కర్మభూమియగు ఈ నేలపై వైదిక కర్మాచరణ యోగ్యత గృహస్థులకు మాత్రమే కలదు. బ్రహ్మచారులు, యతులు, అతిథులు, దేవతలు, పరిచారకులు, పశ్వాది ప్రాణి జాతము గృహస్థును ఆశ్రయించుకొని ఉందురు. ఇట్లు సర్వ ప్రయోజన కారియగు ఈ వివాహ సంస్కారమును భారతీయులు ఆచరించుచున్ననూ అందలి విశిష్టత, అందు ఉపయోగింపబడు మంత్రముల భావము తెలియకుండుటచే ఈ వివాహము విశిష్ట సంస్కారముగా కాక వేడుకగా మారుచున్నది. ఈ పరిస్థితులలో వధూవరులకు ఈ సంస్కారము నందలి గొప్పతనమును తెలియ జెప్పి మానవుని పరిపూర్ణునిగా ఐహిక, ఆముష్మిక ఫల సమృద్ధి

గలవానిగా చేయుటకు తగిన విజ్ఞానము ఈ గ్రంథమున అందింప బడినది.

స్నాతకము, అంకురార్పణము, కన్యావరణము, కన్యాదానము, సుముహూర్తము, సూత్రధారణము, యోక్త్ర బంధనము, తలంబ్రాలు, రక్షాబంధనము, బ్రహ్మగ్రంథి, ప్రధాన హోమము, సప్తపది, లాజ హోమము, ప్రవేశ హోమము, నక్షత్ర దర్శనము, ఆగ్నేయ స్థాలీపాకము, సమావేశనము అను విభాగములతో కృష్ణ యజుర్వేద తైత్తిరీయశాఖ, ఆపస్తంబ సూత్రానుసారముగా ఈ సంస్కారము యొక్క పరిచయము ఈ గ్రంథమందు గావింప బడినది. కేవల కామోపభాగమునకే కాక కర్తవ్యపాలన, క్రమ పరిణతి, ఈ వివాహము యొక్క లక్ష్యములు. ఆధునిక విజ్ఞాన సంపన్నులు అగు గ్రంథకర్త అధునాతన పాఠకుల అభిరుచిని గమనించి విషయమును సూటిగా, సంక్షిప్తముగా, సుబోధకముగా చూపుచూ ఆయా మంత్రముల అంతరార్థములను, సాంకేతిక విజ్ఞానమును అందించుట ఇందలి ప్రత్యేకత. తెలిసిచేయుపని తప్పక సఫలము కాగలదు. కావున నూతన వధూవరులు అవశ్యము ఈ గ్రంథ సహాయమున సంస్కార ప్రాముఖ్యము నెరిగి సంస్కృతులు కాగలరు. సంస్కార సంపన్నులగు దంపతులకు కలుగు సంతతి గూడ సల్లక్షణ శోభితము కాగలదు.

ఆంగ్లమూలమునకు, ప్రామాణిక మగు ఆంధ్రానువాదము పాఠకులకు అత్యంతోపకారకము. గ్రంథకర్త, అనువక్త అభి

నంద్యాలు  ఈ విధముగనే ఇతర సంస్కారముల ప్రాముఖ్యము గూడ చదువరులకు అందజేసిన  సమాజము సంస్కారవంతమై ఐహిక, ఆముష్మిక అభ్యున్నతి నొందగలదు

న్యాయ, వ్యాకరణ విద్యాప్రవీణ

విశ్వనాథ గోపాలకృష్ణ, M.A.



# I

# స్నాతకము

మానవుడు కామమయుడని బృహదారణ్యకోపనిషత్తు చెప్పుచున్నది. (కామమయేవాయంపురుషః)

కామప్రేరితుడై మనుజుడు ప్రవర్తించును. మానవుని ప్రతిపనికిని కారణము–కార్యములున్నవి. కారణము, కార్యము నొక యవిచ్ఛిన్నమైన చక్రముగా వర్తించుటచే, తానొనర్చు కార్యముల సఫలత–విఫలతలచే ప్రభావిత డగు మానవుడు కోరికలను సుడిగుండమున బట్టువడుచున్నాడు.

అందుచే మానవుడు హృదయమున కోరికలనుండి విముక్తుడైననాడు, ఇచటనే అమరుడై భగవంతుని దర్శనానుభూతిని గాంచుచున్నాడని ఉపనిషత్తు నొక్కివక్కాణించుచున్నది, (యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః, అథ మర్త్యో అమృతో భవతి, అత్ర బ్రహ్మ సమశ్నుతే).

వాంఛ నుండి వాంఛారహిత స్థితికి, మానవునిలో క్రమ పరిణతి గల్పించుటకై హైందవ వివాహ విధానము నిర్దేశింపబడి యున్నది.

వైవాహిక ధర్మప్రక్రియలో వరుని (పెండ్లికుమారుని) చర్యలతో మొదలగు స్నాతకోత్సవ విధానమును సమీక్షించుటకు

ముందు-మానవుని సృష్టి విషయమై వైదికభావనలకును, ప్రకృతి పరిణామ విధాన సంబంధ భావనలకును మధ్య ఒక వింతమైన సారూప్యమును గమనించుట ఆవశ్యకము.

ఆదిమ జీవన విధానము మొట్టమొదట తనకుతానుగ, క్రమబద్ధీకరించుకొను సామర్థ్యము నలవరచుకొని, పిమ్మట సమాధానపడి, ఆ వెనుక మనుగడకు కావలసిన చిత్తస్థైర్యము నభివృద్ధిపరచుకొనెను. చైతన్యయుతమో, రహితమో, యెఱుగబడని యీ(Virus యొక్క will to survive) నిలువవలెనను జీవాణు సహిత సాంగనిర్మాణపు చిత్తస్థైర్యమునకు, నేడు శాస్త్రజ్ఞుడు కలవరపడినను, వైదిక విజ్ఞానులగు దీర్ఘదర్శులు 'ఇచ్ఛ' అనునొక అజ్ఞాతశక్తి సృష్ట్యాదినుండెనను నిశ్చయము కల్గియుండిరి వైదిక భావనలో జలపరమాణువు ఆత్మవివేకముచే ప్రజాపతి సృజనాత్మక తత్త్వముగ పరిణతి చెందెను. (కామ స్తదగ్రేసమవర్తతాధి, స ప్రజాపతిరేకః పుష్కరపర్ణే సమభవత్)

శాస్త్రజ్ఞులలోని మనవలయునను సంకల్పము, సృజింపవలెనను ప్రజాపతి హృద్గతేచ్ఛయు నొకచోట కలియుటయేకాదు, అవి హైందవ వివాహ ప్రక్రియలోని వివిధ కార్యకలాపములకు పునాదులగుచున్నవి. (తస్యాన్తర్మనసి కామస్సమవర్తత, ఇదం సృజేయమితి )

దేశీయ భాషలో "స్నాతకము" గా పిలువబడునది నిశ్చయముగ నొక సంఘటనకాదు. సంస్కృతమున "స్నాతకః" అనగా

నొక వ్రతమునకై సిద్ధమగుచు, నాచారము ననుసరించి స్నానము చేయు వ్యక్తి.

వ్రతదీక్షకు బాహ్యశుద్ధియు పిదప నాంతరశుద్ధియు ముఖ్యమనుట స్పష్టమగుచున్నది.

వరుని వైపునుండి ప్రారంభింపబడునదియును, స్నాతకము పేరున సాధారణముగ చెప్పబడునదియు నగు కార్యక్రమము, వృద్ధిపరిణామదశలో నేవేని వచ్చు లోపములను తొలగించు నాంతర శుద్ధికిని, మున్ముందు రాగల కాలమున తాను గృహస్థుగ నెదుగుటకు తన్మూలముగ (వేదచోదిత కర్మాచరణమువలన) విశ్వాత్మునితో తన నైక్యము సాధించుటకు జ్ఞానము సంపాదించి, చివఱకు మోక్షము నందుటకు వలసిన యాంతరశుద్ధి పొందుటకు నైయున్నది. 'వేద' అను పదము 'విద్' అనగా "తెలిసికొను" అనునర్థముగల ధాతువునుండి యేర్పడినది. మానవపరిణామముతో మారుచున్న నేటి కాలమున 'వేద' యను పదమునకు అర్థము మానవ సంఘాప యోగార్థము ఇచ్చిపుచ్చుకొను సూత్రముపై నేవ్యక్తియైనను గడించిన విజ్ఞానమని చెప్పవచ్చును. 'Scire' అను ధాతువునుండి ఏర్పడిన 'science' కూడా 'వేద' పదానికి పర్యాయమే.

గురుకులమునుండి ఇంటికి తిరిగివచ్చుటయగు "సమావర్తనము" వంశక్రమ ప్రకటనముతో మొదలగు "స్నాతకము" నిజముగ బ్రహ్మచర్యాశ్రమమునుండి తరువాతి దశకు ఒక సంవ

త్సరము ముందుగనే జరుగు సన్నాహమనవచ్చును. మార్పు చెందిన నేటికాలమున సుమారుగ 15 యేండ్ల వయసుగల వరుడు కాని, అయిదురోజుల పెండ్లికాని కనబడుటలేదు. స్నాతక కార్య క్రమము పెండ్లి జరుగనున్న దినముననే జరుపబడుచున్నది. (ఉపనయనము, వివాహము, శోభనకార్యము మూడు వేర్వేరు సమయములలో జరుపుటయను మాట యేనాటిదిగానో నేడు చూప ట్టవు సర్వసామాన్యముగ ని మూడు శుభకర్మములు నొకే దిన మున జరుపబడుచున్నవి.)

ఈ సందర్భమున పాఠకునకు "గోదాన వ్రతము" అను క్రియా కలాపమునకుగల సాంకేతిక లక్షణము తెలుపదగును. (గోదానమను క్రియ గోవును దానమిచ్చుటకాదు, క్షౌరమునకు సంకేతము.) ఇది ఒక సంవత్సరకాలము "సమావర్తనము"గా జరుగదగు క్రియ. "అస్యబ్రహ్మచారిణః శ్మశ్రు సంస్కార సహితం గోదాన కర్మకరిష్యే" అను పదములు "ఈ బ్రహ్మచారికి నేను గడ్డము, మీసములు తీసివేయుటయను క్షురకర్మము గావించుచున్నాను" అను అర్థమును తెలుపును. ఈ మాటలు వరుని 'గురువు' పలుకవలసి యున్నది. (ఈ కాలమున చాల తక్కువమంది 'వరులు' గడ్డము-మీసము పెంచుచున్నారు; శిరోముండనమున కంగీకరించరు. అందుచేత యీ క్రియ వారికి తగినదిగ లేదు.)

మఱియు స్నాతకము మణికుండలములుగా చెప్పబడు కర్ణాభరణాదులగు బహువిధోపకరణములతో సన్నాహపూర్ణమై

నొక వ్రతమునకై సిద్ధమగుచు, నాచారము ననుసరించి స్నానము చేయు వ్యక్తి.

వ్రతదీక్షకు బాహ్యశుద్ధియు పిదప నాంతరశుద్ధియు ముఖ్యమనుట స్పష్టమగుచున్నది.

వరుని వైపునుండి ప్రారంభింపబడునదియును, స్నాతకము పేరున సాధారణముగ చెప్పబడునదియు నగు కార్యక్రమము, వృద్ధిపరిణామదశలో నేవేని వచ్చు లోపములను తొలగించు నాంతర శుద్ధికిని, మున్ముందు రాగల కాలమున తాను గృహస్థుగ నెదుగుటకు తన్మూలముగ (వేదచోదిత కర్మాచరణమువలన) విశ్వాత్మునితో తన యైక్యము సాధించుటకు జ్ఞానము సంపాదించి, చివఱకు మోక్షము నందుటకు వలసిన యాంతరశుద్ధి పొందుటకునై యున్నది. 'వేద' అను పదము 'విద్' అనగా "తెలిసికొను" అనునర్థముగల ధాతువునుండి యేర్పడినది. మానవపరిణామముతో మారుచున్న నేటి కాలమున 'వేద' యను పదమునకు అర్థము మానవ సంఘోపయోగార్థము ఇచ్చిపుచ్చుకొను సూత్రముపై నేవ్యక్తియైనను గడించిన విజ్ఞానమని చెప్పవచ్చును. 'Scire' అను ధాతువునుండి ఏర్పడిన 'science' కూడా 'వేద' పదానికి పర్యాయమే.

గురుకులమునుండి ఇంటికి తిరిగివచ్చుటయగు "సమావర్తనము" వంశక్రమ ప్రకటనముతో మొదలగు "స్నాతకము" నిజముగ బ్రహ్మచర్యాశ్రమమునుండి తరువాతి దశకు ఒక సంవ

త్సరము ముందుగనే జరుగు సన్నాహమనవచ్చును. మార్పు చెందిన నేటికాలమున సుమారుగ 15 యేండ్ల వయసుగల వరుడు కాని, అయిదురోజుల పెండ్లికాని కనబడుటలేదు. స్నాతక కార్య క్రమము పెండ్లి జరుగనున్న దినముననే జరుపబడుచున్నది. (ఉపనయనము, వివాహము, శోభనకార్యము మూడు వేర్వేరు సమయములలో జరుపుటయను మాట యేనాటిదిగానో నేడు చూప ట్టవు. సర్వసామాన్యముగ ని మూడు శుభకర్మములు నొకే దిన మున జరుపబడుచున్నవి.)

ఈ సందర్భమున పాఠకునకు "గోదాన వ్రతము" అను క్రియా కలాపమునకుగల సాంకేతిక లక్షణము తెలుపదగును. (గోదానమను క్రియ గోవును దానమిచ్చుటకాదు, క్షౌరమునకు సంకేతము.) ఇది ఒక సంవత్సరకాలము "సమావర్తనము"గా జరుగదగు క్రియ. "అస్య బ్రహ్మచారిణః శ్మశ్రు సంస్కార సహితం గోదాన కర్మకరిష్యే" అను పదములు "ఈ బ్రహ్మచారికి నేను గడ్డము, మీసములు తీసివేయుటయను క్షురకర్మము గావించుచున్నాను" అను అర్థమును తెలుపును. ఈ మాటలు వరుని 'గురువు' పలుకవలసి యున్నది. (ఈ కాలమున చాల తక్కువమంది 'వరులు' గడ్డము–మీసము పెంచుచున్నారు; శిరోముండనమున కంగీకరించరు. అందుచేత యీ క్రియ వారికి తగినదిగ లేదు.)

మఱియు స్నాతకము మణికుండలములుగా చెప్పబడు కర్ణాభరణాదులగు బహువిధోపకరణములతో సన్నాహపూర్వమై

యున్నది. ఇదియును నేటి కాలమున అనుసరింపబడని ఆచారముగా మాఱిపోయినది. అందుచే నా యా సందర్భములకు సంబంధించిన వివరములు వివాహపు అంతరార్థము తెలియజేయు ఈ పుస్తకములో తెలుపబడుటలేదు. ఆయా సందర్భముల పఠింపబడు మంత్రములు సాంకేతికముగ విజ్ఞులగు చదువరుల యాసక్తి దీర్చుటకు ఈ రచన కొనసాగును.

ప్రధాన జీవనాధారమైన నీటికి, ఆహారపచనార్థము ముఖ్యమగు నిప్పునకు, భౌతికోపయోగములకు తోడుగ వైదిక ఋషులు తాత్త్వికస్థానము గూడ కల్పించిరి. స్నాతక ప్రాముఖ్యమును నిర్దేశించు నొక మంత్రమును మనమిచ్చుట ప్రత్యేకముగ గమనింపవలసి యున్నది.

"జలములు దీర్ఘాయుస్సును, ఆత్మోన్నత్యమును ప్రసాదించుగాత". ("ఆప ఉన్దన్తు జీవసే దీర్ఘాయుత్వాయ వర్చసే").

వేదవ్యాఖ్యాతయగు సాయనాచార్యులు ఈ మంత్రమును ప్రథమ క్షౌరమంత్రముగ పేర్కొనెను. ప్రస్తుతము 'గోదానము'ను బ్రహ్మచారి తూర్పుముఖముగ కూర్చొని (మంత్రపూతమైనవిగా భావింపబడు సప్తసాగర) జలములచే తన వర్చస్సును శుభ్రపరచుకొని తాను ధరించిన సువర్ణాలంకారముల కాంతితో పెంచుకొనుటగా తలంపవలసియున్నది.

వరుడు తానెదుగు దశలో తెలిసియు, తెలియకయు చేసిన పాపములకు ప్రాయశ్చిత్తముగా నెంచవలసినదియు, ఆచమన

ప్రాణాయామములతో కూడిన యీ కార్యక్రమమును శుద్ధిగా భావింపవలసి యున్నది

ఇందలి అగ్ని సంబంధిత మంత్రములు వరుడు యాదృచ్ఛికముగ (సంకల్ప రహితముగ) చేసిన అక్రమకృత్యముల ఫలములను దహించుటకు నాంతరశుద్ధిలోని భాగములే.

"పరిత్వా అగ్నే పరిమృజామి ఆయుషాచ ధనేనచ;
సుప్రజాః ప్రజయా భూయాసం; సువీరోవీరైః;
సువర్చా(ః) వర్చసా; సుపోషః పోషైః సుగృహోగృహైః;
సుపతిః పత్యా; సు మేధా(ః) మేధయా;
సుబ్రహ్మబ్రహ్మచారిభిః" అని

(ఓ అగ్నిదేవా! నా జీవన శక్తులు, నా సంపదలను నీ ముందు పవిత్రీకరించుకొనుటకు అర్పణ చేసికొనుచున్నాను. వీరులలో వీరుడు, సువర్చసులలో సువర్చసుడు, సుపోషకులలోనను, గృహస్థులలోనను, మేధావులలోనను, బ్రహ్మచారులలోనను, ఉత్తములైన సత్సంతానము నాకు కలుగుగాక!)

బ్రహ్మచారియగువాడు, భర్తయగుట యొక దశనుండి మఱియొక దశకు మారుటకాదు. మొగ్గగానున్నవాడు దైవ పరాయణుడై పుష్పసదృశ పూర్ణమానవుడుగా వికసించుట వంటిది.

వరుడు కానున్నవాడు అంతరదృష్టిచే తానింకను విద్యార్జన చేయుటకై వారాణసికి ప్రయాణమగుట, గొడుగు, ప్రాతకాలపు

చెప్పులు ధరించుట మున్నగునవి స్నాతకకార్యకలాపములో గృహస్థ జీవితమును ప్రారంభించు సమయమున నాధ్యాత్మిక భావశోధనకు సూచనప్రాయములుగ గ్రహింపవలసి యుండును.

ఈ "కాశీయాత్ర" మనస్సును కదలించునది యగుటయే కాక, వినోదదాయకమై మానవుని ఆత్మప్రబోధమునకు, ఆత్మ విచారణకు, ఆత్మోన్నత్యమునకును ప్రథమ సోపానమగుచున్నది.

తాను కాశీయాత్రకు పోవుదుననుటలో ("కృతవ్రతచతుష్టయః కాశీయాత్రాంగమిష్యామి") నాత్మశుద్ధికగు "గోదానము", ఆత్మస్థితికగు "సమావర్తనము", ఆత్మపాపపరిహారార్థమునకగు "వ్రతలోప ప్రాయశ్చిత్తము", ఆత్మోన్నతికగు "మణిభూషణధారణ" మను నాల్గు వ్రతములు నాతడు పూర్తిచేయుచున్నాడు.

కాశీయాత్రామార్గమున నాతనిని కన్యతండ్రి ఆపుచేయును. (ఆచారమున క్రమక్రమముగ తండ్రిస్థానము సోదరునిదిగా మారెను. సమావేశమైన యువబంధుమిత్రులకు కొంత వినోదప్రదముగను, ఆకర్షణీయముగను నుండుటకు కాబోలు ని మార్పు.) "మమసుతాం, కన్యాం దాస్యామి పాణిం గృహీత్వా, సాగ్నిఃత్వమ్ గచ్ఛస్వ" అని చెప్పును. (నేను కన్యయగు నా కుమార్తెను ఇచ్చుచున్నాను. ఆమె పాణిని పరిగ్రహించి అగ్నిభట్టారకుని ఆశీస్సులతో వెళ్లుము) అని కన్యాదాత చెప్పును.

ఆ వెనుక వరుడు సమకూర్పబడిన సామగ్రినెల్ల వదలి చాల ముఖ్యమైన (పవిత్ర సంస్కారమునకు, ఆఱకువకును చిహ్నమగు) సమిధను మాత్రము గ్రహించును.

అద్యప్రకృతియొక్క వివిధ దేవతామూర్తులలో నొకనిగ భావింపబడు అగ్నికి నివేదింపబడు పండ్రెండు సమిధలు, స్మృతములును అస్మృతములు (ఎఱుకతోడను, ఎఱుకలేకను) వ్రతములును, అవ్రతములును (సదసత్కర్మములు), సదనుష్ఠితములు, దురనుష్ఠితములునగు వివిధ మానవకృత్యములను సూచించుచు అనివేదనముచే కర్తను అవాంఛితఫలవిముక్తునిగా నొనర్చి, సఫల మనోరథు నొనర్చును.

బ్రహ్మచర్యమును విడిచి, గృహస్థుగా చేకొనవలసిన అవకాశములను, స్వీకరింపవలసిన బాధ్యతలను గుఱించి బ్రహ్మచారిని ఒప్పించు 'సమావర్తన' కార్యకలాపము అతనికి ఆయుస్సు, వర్చస్సు, వీర్యము, సంపదలు. ఆరోగ్యము ప్రసాదించు నాభరణ ప్రదానముతో ముగియుచున్నది.

"ఆయుష్యం, వర్చస్యం. సువీర్యం, రాయస్పోషం,
ఔద్భిద్యం, హిరణ్యం, జైత్ర్యాయ ఆవిశతాం మామ్".

ఐహికాముష్మికాభ్యున్నతి పొందుటకు ప్రార్థింపబడు భగవతి మఱియెవరోకాదు. వరునకు రానున్న భావిసహచరియగు వధువు అనియే సూచింపబడినది.

"సమ్రాజంచ, విరాజంచాభిశ్రీర్యాచ నో గృహే।
లక్ష్మీ రాష్ట్రస్య యా ముఖే తయా మా సగ్ంసృజామసి"॥

# II

# అంకురార్పణము

## (బీజారోపణము)

వధువు తల్లిదండ్రులు కావించు అంకురార్పణము (అంకురారోపణము)తో ప్రధాన వివాహక్రియ మొదలగును. అంతకు పూర్వము వధువు, ఆమె తల్లిదండ్రులు మంగళస్నానము చేయుదురని వేరుగా చెప్పనవసరములేదు. అలాగే ప్రతి హిందూ శుభకార్యమునకును ముందుగా విఘ్నేశ్వర పూజ జరుపుట పుణ్యాహవాచనము పలుకుట మొదలైన సాంప్రదాయికాచారముల గురించి ఈ సంగ్రహ గ్రంథములో వివరించనక్కఱలేదు.

ఒకప్రక్క వధువు తల్లిదండ్రులు అంకురారోపణ విధానమున నిమగ్నులై యుండగా, మఱియొక ప్రక్క వధువు గౌరీపూజ చేయుచుండును.

బీజారోపణమునకు బంగారు లేదా వెండి లేదా రాగి లేదా మట్టితో చేసిన అయిదు పాత్రలు (మూకుళ్ళు) సూచింపబడినవి. మధ్యనుండునది బ్రహ్మపాలిక యని పిలువబడును. తూర్పున ఇంద్రపాలిక, దక్షిణమున యమపాలిక, పడమట వరుణపాలిక, ఉత్తరమున చంద్రపాలికల నుంచుదురు.

మావియాకుల తోడను, దారముతోడను అలంకరింపబడిన

"నాన్దీశోభన దేవతాహ్వానంకుర్యాత్
ఇడావాచనం కుర్యాత్".

భౌతికైక్యముచే సంప్రాప్తమగు నాధ్యాత్మిక సంసరణము వలన నిజముగ విద్యా సౌందర్యములు పొందుటకంటె చారుతరమైన ప్రయోజనము లేదు.

యథావిధిగా గణపతి, గౌరీ ప్రార్థనలను, పూజలను జరిపి, వధూవరులు, తల్లిదండ్రులు, తమకు నిర్ణీతమగు కార్యక్రమములకు సిద్ధమగుదురు.



# III

# కన్యావరణము

## (వధువును ఎన్నుకొనుట)

తరువాత కాబోయే వరుడు తగినదూతను తనకు తగువధువు నన్వేషించు నిమిత్తము పంపును. ఈ విధమైన 'కన్యావరణము' ఈనాడు కేవలం శాస్త్రానురీత్యా మాత్రము నిలిచియున్నది. నిజమునకు అప్పటికే వధూవరుల నిర్ణయము తల్లిదండ్రులచే గాని పురానియుక్తిచేగాని, తమంత తాముగా గాని జరిగియుండునని యెల్లరుకు విదితమే.

ఐనను, దుశ్శకునముల మున్నుగా నాటకంముల నివృత్తికి కొన్నియంత్రములు చదివిన పిదప వరుడు తన అనుంగు మిత్రుల నీక్రిందివిధముగ నడుగు కార్యక్రమము జరుగును.

"ప్రసుగ్మన్తా ధియసానస్య సక్షణి వరేభిర్వరాగ్ం అభిషు ప్రసీదత... (ఓ సముచితకార్యదక్ష మిత్రులారా! మీరు శ్రేష్ఠుల నుద్దేశించి లెస్సగా పయనించుదురుగాత).

ఆ సుహృద్పాంథులగు వార్తావహులు వరునితో కలుపుటకై ఇంద్రుడు కొనివచ్చిన వధువును కనుగొనెదరు.

"ఇంద్రః ఉభయం జుజోషతి".

ఆ వెనుక హృదయోత్తేజకరములగు వధూవరుల (ఉభ

యుల వంశక్రమము) ప్రవరలను ఉభయుల పురోహితులు పఠించెదరు.

ఉభయ పక్షములందును, ముత్తాత, తాత, తండ్రులను వారివారి గౌరవప్రతిష్ఠలు తెలుపుటకు ఉభయులు మూడు తరములను చెప్పుట సంప్రదాయ నిర్ణయమును సాధించును.

'వృణీమహే' (మేము ఎంపికచేసితిమి) అని పురోహితులు ఆ వార్తావహుల స్థానే పలికెదరు.

'వృణీధ్వం', తస్మైదాస్యామి" (ఆమెను ఎంపిక చేసికొనుడు. తప్పక ఆమెను వరుని కొసంగెదనని కన్యాదాత చెప్పును)

అవిధముగ ముమ్మారు ప్రవరను ఉభయుల పురోహితులు (దూతలస్థానే) పఠించిన వెనుక ఉభయవర్గ సమ్మతితో వరునితో "కృతార్థాః వయమితి వరమ్ ఆవేదయేయుః" (కన్యాన్వేషణలో కృతార్థులమయితిమి) అని చెప్పవలెను.

అంతట వరుడిట్లనును:–

"ధర్మప్రజా – సంపత్త్యర్థం స్త్రియముద్వహే"

(ధర్మమాచరించుటకు, సంతానము కొఱకు, కీర్తి కొఱకు, సంపదకొఱకు, నేను ఈ స్త్రీని వివాహమాడుచున్నాను).

ఈ విధమైన వధ్వాన్వేషణము నేడు 'చారిత్రకమే' యైనను, అందలి అంతరార్థము సదా సహకాలీనమే. సంబద్ధకుటుంబముల

సమ్మతి మాత్రమేకాక బంధుమిత్రుల సమ్మతియూ చాలముఖ్యమైనదనుట హిందూవివాహ సంస్థలోగల ఆధ్యాత్మిక, సాంఘిక భావముల ప్రాముఖ్యము చాటుచున్నది.

ఇప్పుడు వధువు తల్లిదండ్రులు వరునకు రెండవ పెద్ద యజ్ఞోపవీతము వేయుట జరుగును. ఈ యజ్ఞోపవీతము (పురుషుని ద్విజత్వమునకు బాహ్యచిహ్నమేయైనను) దానికి సాంఘికముగ. పారమార్థికముగ, ఆధ్యాత్మికముగ గల మౌలిక చిహ్నమును (ప్రజాపతేః యత్సహజం పురస్తాత్) సాంకేతికముగా ధరించుట జరుగుచున్నది.

ఈ యధిక యజ్ఞోపవీతము (నారాయణ స్వరూపుడుగా భావింపబడు) వరుడు గృహస్థుగా వధువునకిచ్చిన వాగ్దానమును పూర్తి చేయుటకు తీసికొను బాధ్యతలను సూచించును.

వధువు తండ్రి ప్రాణాయామానంతరము "లక్ష్మీ నారాయణ ప్రీత్యర్థం సాలంకృత కన్యాదానమహంకరిష్యే" (లక్ష్మీ నారాయణ స్వరూపునకు అలంకార సహితయగు నా కుమార్తెను ఇచ్చుచున్నాను) అని వక్కాణించును.

'లక్ష్మీ నారాయణ' పదములో స్వర్గమునగల పరమపితయు భూమిపైగల వరుడును ఏక దృష్టితో చూడబడినవారగుటచే వరుని కాళ్లను కాబోవు మామగారు కడుగుట మానవ సంబంధ వివాహమును దైవకార్యముగా జరుపుటను సూచించును.

ఈ కార్యక్రమము ద్వారా ఈ వివాహ కార్యక్రమమంతయు సంస్కార పూర్ణమై చెప్పబోవు మహా సంకల్పమునకు దారితీయును.

# IV

## మహాసంకల్పము

విశ్వమునందు ప్రకృతి, భగవంతుడు, మానవుడు, ఈ ముప్వురను గురించి వైభవయుతమగు వివరణమే యిది. మహా సంకల్పములోని అధ-ఊర్ధ్వలోకములయు, తదధి దేవతల నామములనిచేట నేకరువు పెట్టుట యనవసరము. కాని, ఈశక్తిమంతమైన సంకల్పము మానవు డెవనినుండి జన్మించి యెవనిని జేరునో అట్టి భగవంతునిపై నమ్మికను ఉత్తేజకరముగ ప్రసరింప జేయునూహయనిన జాలును.

వధువు తండ్రి వధూవరులనేకము చేయుటతో తన పితౄణము దీర్చినవాడగుచున్నాడు.

"విశ్వంభర స్సర్వభూతా స్సాక్షిణ్యస్సర్వ దేవతాః
ఇమాంకన్యాం ప్రదాస్యామి పితౄణాంతారణాయవై"

ఆధునిక నాకరికతాగమనము మన పితౄణమును కొంత సందేహింపవలసినదిగ చేసియుండవచ్చును. కాని, ఈ స్పందించు చైతన్యము నంగీకరించుటచేత మన ఆధునిక విజ్ఞానశాస్త్రము, మన యెంకలో లేనిదియు, నక్షత్రసహిత భూమ్యాకాశ పరివృత అజ్ఞాతానంత శక్తి వ్యాప్తి గూర్చి గానముచేయు నీ మంత్రమును వినుటచే కనీస ధర్మమును పాటించిన వారమగుదుము.

వంశమును కొనసాగించుటయను భౌతిక సంకల్పము ద్వారుక్తమగుచుండగా, వధువుతండ్రి స్వర్ణాలంకార సహితము, నీటిచే పవిత్రీ కృతమైన వధువు చేతిని వరుని హస్తమున నుంచును.

"ప్రజాసహత్వకర్మభ్యః ప్రతిపాదయామి, ఇతి, సహిరణ్యం, కన్యాహస్తం, ఉదకపూర్వం, వరహస్తే దద్యాత్".

వివాహకాలమున నీ కార్యక్రమము జరుగునపుడు (అచింత్యా పరిమిత శక్త్యాభియమాణస్య) ఆదినారాయణుని అజ్ఞాతానంతశక్తి ప్రార్థింపబడి వాస్తవముగా వధూవరుల ప్రత్యంగమునను ప్రవహించును.

మానవునిలోని దైవీ ప్రకృతి, ఆతనిలోని పాశవిక ప్రకృతిని జయించుటకే వివాహప్రక్రియ యేర్పడినదని వైదిక భావము. (ఛాన్దోగ్యోపనిషత్తులో చెప్పబడినట్లుగా, 'సత్యకామః, సత్యసఙ్కల్పః' అయిన పరమాత్మ సత్యకాముడైన, సత్యసంకల్పుడైన జీవాత్మకు భిన్నుడుకాడు: 'తత్త్వమసి').



# V

# కన్యాదానము

పవిత్ర జలముతో తండ్రియిచ్చిన సాలంకృతయగు వధు వును వరుడు స్వీకరించుటతో మహాసంకల్పము పూర్తియగును.

వేదమంత్ర పఠనమగుచుండగా స్వయం దత్తమగు వధూ హస్తమును వరుడు గ్రహించును.

(ఎల్లరు నెఱిగిన "ధర్మేచ..." అనెడి మంత్రము తప్ప వరునిస్థానే పురోహితుడే ఈ మాటలు పలుకును).

"దేవస్యత్వా సవితుః ప్రసవే। అశ్వినోర్బాహుభ్యామ్। పూష్ణో హస్తాభ్యాం ప్రతిగృహ్ణామి। రాజాత్వావరుణోనయతు, దేవి, దక్షిణే ప్రజాపతయే కన్యామ్; తేనామృతత్వమశ్యామ్"

(సూర్యదేవతాకమైన శక్తి, దేవతావైద్యులగు అశ్విని దేవ తలచే ప్రేరితమై సూర్యస్వరూపుడగు పూషుని ద్వారా ప్రసారి తమైన నా హస్తముతో నీ హస్తము గ్రహింతును వరుణ దేవుడు ప్రజోత్పత్తి పితకు నొసగు కాన్కగా నిన్నునన్ను చేర్చుగాక. అందువలన అమృతత్వము పొందుదునుగాక)

ఇచట వరుని స్వీకరణోపన్యాసమున నంతటికి ప్రముఖ మగు ప్రతిజ్ఞావాక్యము వెల్వడును.

"క ఇదం కస్మా అదాత్? కామః కామాయ। కామోదాతా। కామః ప్రతిగ్రహీతా"॥

[ఇది ఎవరు ఎవరికిచ్చిరి? దైవీయ (చైతన్య) చేతనత్వారో పిత కామము (కోరిక) మానుషకామమునకిచ్చెను (వాస్తవము నకు) ఇచ్చునతడు, స్వీకరించునతడును మహా కామ ప్రకృతి స్వరూపములే]

దైవమే కారణమై మానవ సృష్టికి మూలమైన కామము ఇచట భౌతికవాంఛా ప్రేరణతో వైవాహికబంధముగ మారు చున్నది. అందుచే దైవీయ, మానవీయ శక్తులు పునరుత్పత్తిని వాంఛించి కలియుచున్నవి.

ఈ భావమే మిగిలిన స్వీకరణ మంత్రములలో విపులీ కరింపబడుటచే, ఇచట ఇంతకుమించి చెప్పనవసరము లేదు.

వైవాహిక ధర్మ సూత్రముల నతిక్రమించనని వరుడు బాసచేయుటకు పూర్వమే వధువుతండ్రికి ఉపదేశముగా చెప్ప బడు కొన్నిమాటలు గమనార్హములు;

"దాతా కన్యాదాన సాధ్గుణ్యార్థం మానసోత్సాహ పరిమిత దక్షిణాం వరాయ దద్యాత్"

(కన్యాదానమును ఉజ్జ్వలోపేతము చేయుటకు వధువు తండ్రి వరునకు తన ఇచ్ఛాపూర్వకోత్సాహ సామర్థ్యముల ననుస రించి కొంత బహుమతి నీయవలయును)

ఏదియోయొక రూపములో 'కట్నము'మనెడిది విశ్వవ్యాప్తమే. వధువు తన నూత్న సంసారమునకగు వ్యయమును కొంత సమ

కూర్చుకొనుటకు పైతృకమైన సంపదలో లేశము గ్రహించుట సమర్థనీయమే. కాని, ఐచ్ఛికమగు దానిని నిర్బంధముగా మార్చుట వేదసమ్మతము కాదు.

హైందవ వివాహము నతిపవిత్రము, నాదర్శవంతముగా జేయుచు నెల్లరు నెఱిగిన సంభాషణము ఇపుడు వినవచ్చును.

వధువుతండ్రి చెప్పును— ధర్మేచ, అర్థేచ, కామేచ త్వయా ఏషా నాతిచరితవ్యా" అని.

(ఈ నా సుతయెడ ఎట్టివిధముగను – కార్య భార విషయమునగాని, సొమ్ము విషయమునగాని, కోరికలు తీర్చుకొను విషయమునగాని, విపరీతముగా ప్రవర్తింపరాదు).

వరుని సమాధానము — 'నాతిచరామి' (నేనిప్రతిజ్ఞను అతిక్రమించి ప్రవర్తింపను) అని

వధువు తన చోట తాను కూర్చొనియుండగా వరుడు పవిత్రాగ్నిని ప్రజ్వలింపజేసి (అగ్నిప్రతిష్ఠాపనము చేసి) కల్యాణ వేదికవద్దకు వెడలును.

ఆ సమయమున (వధువు తండ్రి వరునకు మధుపర్క ప్రదానము చేయు సమయమున) నాతడు కూర్చొనుటకు ఆసనముగా ఉండుటకు దర్భలతో 'కూర్చ'ను (చిఱుచాపను) సమకూర్చెదరు.

అప్పుడు వధువునకు, వరునకు మధ్యగా (అంతఃపటలం కృత్వా) తెఱను పట్టుదురు

కూర్చపై వరుడు "రాష్ట్రభృత్ అసి ఆచార్యా సందీ మా త్వత్ యోషమ్" (నీవు తన మాటపై నిలుచునాకు స్థానమ యిత్తివి నీ నుండి నేను వేఱుకాను) అను మంత్రము చెప్పుచు కూర్చొనును

వధువుతండ్రి ఈ విధముగ చాటిచెప్పును." "మయా క్రియమాణ కన్యాదానాంగత్వేన వరం మధుపర్కేన పూజయిష్యే" (కన్యాదాన విధానమున భాగముగా నేను మధుపర్క సాహాయ్యమున వరుని పూజింతును).

మధుపర్కము ఈ విధముగా చెప్పబడినది. "యత్ మధునో మాధవ్యం, పరమం, అన్నాద్యం, వీర్యమ్" (మధువుతో చేయబడిన ఈ పానీయము అత్యంతము వాంఛనీయము. జీర్ణమగునది, మఱియు బలవర్ధకము).

ఈ విధముగ మధుపర్క ప్రాశనము (మధుపర్క గ్రహణోత్సవము) ముందుగా సాక్షాద్విష్ణువుగా భావింపబడు వరుని కాళ్లు కడిగిన వెనుక జరుగును " శ్రీ లక్ష్మీనారాయణ స్వరూప, వర, అయం తే మధుపర్కః" అని చెప్పుచు వరునకు వధువు తండ్రి యిచ్చును. ('మధుపర్క'మనగా తీయని పానీయమని అర్థము. కాని. ఆ పానీయముతో ఉత్సవమునకు వస్త్రములు

ఇచ్చుట కలదు. కావున కాలక్రమమున ఆ వస్త్రములే మధుపర్కములుగా వాడుక భాషలో గ్రహింప బడుచున్నవి)

"మయి మహో, మయి యశో, మయి ఇంద్రియం వీర్యమ్" అను మాటలు ఒక సంప్రదాయమున వరుని చేతను, మఱియొక సంప్రదాయమున వధువుతండ్రిచేతను చెప్పబడును కాని, ఉభయపక్షములను తేజస్సు, ఇంద్రసమశక్తియు, కీర్తియు వాంఛించు భావ ప్రకటనము పవిత్రవివాహ సందర్భమున నత్యంతము తగియున్నది.

అదే విధముగ అగ్ని దేవతను సాక్షిగ స్థిరపరుచు మంత్ర విధానము హైందవ విధిని మానసికౌన్నత్యము ప్రకటించునదై అగ్నిదేవతకు హవిః ప్రదానము పవిత్రీకరించుటను సాంకేతిక మైనదిగానున్నది.

"అగ్నిః ప్రాశ్నాతు ప్రథమః, స హి వేద యథాహవిః" 'ప్రథమః' అనుమాటః అగ్ని మొదట వినియోగపరుచుట అనుట హిందువులకు శబ్దార్థములకంటె, అంతరర్థములకు ప్రాధాన్యము కలదనుట నిర్ధారించును ('అగ్ని' అనగా ఊర్ధ్వగామి అనిభావము, ఈ పదము కేవలము భౌతికమైనది కాదు).

పిమ్మట మామగారు పవిత్రీకృతములగు కానుకలను (గోదానముకూడ ఉండవచ్చును) అల్లునికి "యజ్ఞోవర్ధతామ్...." అనుచు ఇచ్చును.

ఈ కార్యక్రమమంతయు మూఢనమ్మకముతోడి చేష్టకాదు ఇదియొక యజ్ఞము. ఈ విషయము పైన జెప్పిన "ఈ యజ్ఞ మభివృద్ధి గాంచుగాత' యను ప్రార్థన వలన స్పష్టము.

అటులనే 'మధుపర్కము'ను వరుడు అందుకొను సమయ మున చదువు ఈ దిగువ మంత్రములు బాహ్యప్రదానమున ఇమిడియున్న బుద్ధివిశేషము నెఱిగించును.

"త్రయ్యై విద్యాయై యశోఽసి, యశసో యశోఽసి, బ్రహ్మణో దీప్తిరసి, తం మా ప్రియం ప్రజానాం కురు అధిపతిం పశూనామ్".

(నీవు భగవత్తేజము, వేదవిద్యాకీర్తులతో జన్మించితివి. అందుచే నన్ను సత్సంతానము, పశు సంపదకల వానినిగా జేయుము.)

"అ మాగన్ యశసా వర్చసా సగ్ంసృజ పయసా తేజసాచ తం మా ప్రియం ప్రజానాం కురు అధిపతింపశూనామ్".

(నీవు నాదరి) జేరుము, నేను ప్రజలకు ఇష్టుడను పశు సమూహముల కలవాడనగుచు కీర్తి, తేజస్సు, క్షీర సమృద్ధి ననుభవించునట్లొనర్చుము).

అగ్నిదేవునితో కూడ గోదేవతను అర్చించుట ఈ సమయ మున కలదు. కాని, వర్తమాన కాలమున ఈ గోదేవతా పూజ నము జరుగుట లోపించినది.

ఈ మధుపర్కోత్సవము వధువు తండ్రి వరునకు నూత్న వస్త్రములిచ్చుట "అర్చత, ప్రార్చత"యను మంత్ర పఠనముతో సమాప్తమగును.

వరుడు అంతట నూత్నవస్త్రములు ధరించి "సభాయై నమః" అని చూడవచ్చిన సదస్యులకు నమస్కరించి తనకు నిర్ణీతమైన ఆసనమున కూర్చుండును.

ఇప్పుడు అతిముఖ్యమైన సుముహూర్తము వచ్చును. అంతకుముందు "మంగళాష్టకము" మఱియు చూర్ణికయును పఠింపబడును.

ముఖ్యముగా హిందూ వివాహము యొక్క విశేషార్థమును ప్రతిపాదించెడి ఈ పుస్తకమున ఆ రెండింటిని విశదీకరింపబనిలేదు. కాని, అందలి ముఖ్యాంశములు తప్పక గుర్తింపవలసియున్నది. ఎందుచేతననగా "మహాసంకల్పము" నందువలె ఈ పఠనము కూడ 'భూమ్యాకాశముల', 'మానవ-దేవతా'. ప్రకృతి-చేతనల యేకీకరణమునకు జగత్సంబంధ-జగదతీత శక్తుల అన్యోన్య సంబంధమునకు చిహ్నముగా నిలుచును కనుక.

ప్రముఖముగ శ్రీరామచంద్రుని, అతనికి సంబంధించిన దేవతలను, వారి ఆశీస్సులు నూత్న వధూవరులకు కలుగుటకు 'మంగళాష్టకము'న ప్రార్థించుట జరుగును.

చూర్ణికలో పెక్కుమంది దేవతలను, ప్రకృతి శక్తులను భూమీశ్వరులను, వీరులను, పవిత్ర గ్రంథములను, పుణ్యస్థలము

లను ఏకరువు పెట్టుదురు. అవి శ్రద్ధాళువులై వినువారికి ఈ వివాహ కార్యక్రమము ఒక పురుషునకు, ఒక వనితకు జరుగునది మాత్రమే కాదనియు విశ్వైక్యమునకు, విశ్వసమ్మేళనమునకు ఒక సాధారణ లౌకికచర్యతో జరుగునొక పవిత్రీకరణ విధానముగా తోచగలదు.

వాస్తవమునకు "సుముహూర్త" సమయము పదార్థ విజ్ఞాన శాస్త్రీయమైన సాంకేతికవైశిష్ట్యమును ఆధ్యాత్మిక వైవాహిక ప్రక్రియకు కలుగుజేయుటను.

"సుముహూర్తే వధూవరయోః శిరసః అన్యోన్యం సజీరక గుడం నిక్షేపేతామ్" అనిచెప్పుచు అన్యోన్య ప్రేరకముగ జీలకఱ్ఱ బెల్లము ముద్దను వధూవరులు ఒండొరుల శిరస్సులపై నుంచుటయే ఈ సుముహూర్తము యొక్క ఆధిభౌతిక, ఆధ్యాత్మిక సంయోగము.



# VI

# సుముహూర్తము

'మమాగ్నే' అనుమంత్రము మాదిరిగనే అన్ని శుభకార్యములకు నాదియందు "ధ్రువం తే రాజా... అయంచ బ్రహ్మణస్పతిః" అనుమంత్రము సాంప్రదాయికముగ సుముహూర్తతరుణము ప్రారంభించుటకుముందు పఠింపబడును.

సార్థకమైన 'ధ్రువమ్' అనుపదము ఈ మంత్రమునమింటి దేవతలకు–మంటిప్రకృతికి నొకప్రక్కను, భగవంతునకు-భక్తునకు మఱియొక ప్రక్కను గల సుస్థిర సంబంధమును నొక్కిచెప్పుచు అనేక పర్యాయములు వినబడును.

కాని, ఇప్పుడు ఈ వివాహసందర్భమున ఈ 'ధ్రువమ్" అనుపదము శాస్త్రీయదృక్పథమున మరింతగ సంగతమైన ప్రాముఖ్యముసంతరించుకొన్నది.

భిన్నధ్రువము లాకర్షించుకొనుట శాస్త్రీయమగు సత్యము. జ్యోతిష (ఫలభాగ) శాస్త్రము, జ్యోతిష (సిద్ధాంతభాగ) శాస్త్రమునుండి పుట్టినట్లు, రసాయన శాస్త్రము సువర్ణయోగ శాస్త్రమునుండి పుట్టినది. మనపూర్వులైన రసాయన శాస్త్రవేత్తలు "జీలకఱ్ఱ–బెల్లము' మొదలగు పదార్థసంయోగములవలన 'ధన'–'ఋణ' ధ్రువవిద్యుత్ క్రియలుద్భవించునని తమ పరిజ్ఞానమునువెల్లడించితిరి. ఆ మిశ్రమమునగల సహజమైన జిగటయు అన్యోన్యాకర్షణనిచ్చు విద్యుత్తు, తత్కారణముగ వధూవరులకు

అన్యోన్య ప్రీతిప్రేరకమగుటయే కాదు, వధూవరులిరువురును జీవితాంతము "ధ్రువమ్" కలిసి యుండవలెనను గొప్పసూచన కూడ యున్నది.

ఇంతకంటె యజమానుని (ఇటవరుని) బ్రహ్మణప్రతిగ- తనలో బ్రహ్మైక్యమును వివాహమున వధూవరుల కలయికగ ఉత్కృష్టముగ గ్రహించు తుదివాక్యము చాల అర్థవంతమైనది.

ఈ సందర్భమున వధూవరులను ఒకరినుండి మఱొకరిని మఱుగువరచు తెఱను తొలగించుటకూడ ముఖ్యమైన విషయము. ప్రకృతినుండి పాడము మాయ తెరవలె మానవుని దైవత్వము నుండి కప్పియుంచి తొలగునట్లు, స్త్రీపురుష లింగభేదములను వివాహము తొలగించి వధూవరులను శారీరకముగ, మానసిక ముగ, ఏకముగా జేయుటను సూచించును.

సుముహూర్త సమయమున వరుడు సూటిగ వధువును చూచును (సుముహూర్తే కన్యాం స్వయం దృష్ట్వా 'తృతీయం' జపేత్) 'తృతీయ' యనునది అనువాకమున తృతీయచరణము

"అభ్రాతృఘ్నీం, వ- ణ-అపతిఘ్నీం, బృహస్పతే, ఇంద్ర-అపుత్రఘ్నీం, లక్ష్మ్యం తామ్ అస్యై సవితఃసువ".

పురుషశక్తికి సాంకేతికస్వరూపులగు ముగ్గురు దేవతలను వరుడు ప్రార్థించును. బుద్ధిబలమునకు బృహస్పతిని, వీర్య బలమునకు జలాధిదేవతయగు వరుణుని, భౌతికశక్తిని పని

రక్షించు సవితయను ఆదిత్యశక్తిని తనవధువునకు లక్ష్మీ కటాక్షమునకు, సంపదలకునై ప్రార్థించును. తనవధువును ఆమెతండ్రి కుటుంబమును వేధించనదిగను, పతికుటుంబమునకు, పరిసరములకు హితకారిణిగను సూచించును.

వేదమునందలి పదములకు బాహ్యార్థము వెనుక, పారమార్థికార్థము దాగియుండునను మాటను నిరంతరము జ్ఞప్తియందు నిలుపుకొనవలెను. నిజముగ నిచట వధువే లక్ష్మియను సూచన కలదు.

ఇచట సుముహూర్తమునకు 'కన్యానిరీక్షణము' (వధువును చూచుసమయము) అను సార్థకనామము కూడకలదు.

మిగిలిన అనువాకముకూడ వధువును ఉన్నత భావములు, విశాలహృదయము కలదానినిగా జేయుడనియు, స్వర్గస్థులైనట్టియు భూమిపైనున్నట్టియు బంధువులయెడ సౌహార్దము కలదానినిగా జేయుడనియు, తేజశ్శాలినిగా జేయుడనియు నర్థముగల ప్రార్థనలతో ఉండును. దర్భతో వధువు భ్రూమధ్యము స్పృశించుట మనోభావమును సూచించెడి ఆజ్ఞాచక్రకస్థానమున నిలుచుట కవకాశమున్న చెడుతలపులను తుడిచివేయుటకు సంకేతము.

బండికాడి రంధ్రము గుండా ఇంద్రుడు వ్యాధిసోకిన 'అపాల'ను ఉజ్జ్వలప్రాణిగజేయుటకు ముమ్మారు పవిత్ర జలము ప్రవహింపజేసెననుటను యుగచ్ఛిద్రాభిషేకము (బండి

కాడి లేక నాగేటికాడికిగల రంధ్రము గుండ నీరుపోయుట) సూచించును.

వధువునందలి భౌతికశక్తులను ఆధ్యాత్మిక (లేక) పారమార్థిక తేజస్సుగా తీర్చుటయనునది ఈ ప్రార్థనలో పవిత్రీకరణముతో కూడిన వివాహబంధ కార్యక్రమమందలి సాధారణ నిర్దేశము. అందుచే కాడికిగల రంధ్రముగుండా వధువు తలపైని నీళ్లు పోయుట (కన్యాస్నానము) జరుగును.

బంగరు రంగుగల (హిరణ్యవర్ణాః ఆపః) నీళ్లు, భౌతిక 'శం' (సౌఖ్యమును), పారమార్థిక "స్యోనః" (పరమానందమును) నిశ్చయపరచును.

స్నానక్రియ జరుపువేళ పఠింపబడు అయిదు మంత్రములతో కడపటిదగుమంత్రము ఆకారణముచే ద్వంద్వార్థ సహితమై ఒక్కమారు మాత్రమే నీటినిచల్లుట కలిగియున్నది. "పఞ్చానామన్తే సకృదేవ స్నాపయతి".

(అటుపిమ్మట వధువునకు నూత్నవస్త్రము నొసంగవలెనను నియమముకలదు. దాని అర్థము: భౌతిక మైన వాక్కులనుండి వధూవరులను తత్త్వచింతన వైపునకు క్రమాభివృద్ధినందవలయుననుటను సూచించును. "పరిత్వా గిర్వణో గిర ఇమాభవన్తు విశ్వతః, వృద్ధాయుమను వృద్ధయో జుష్టా భవన్తు జుష్టయః".

ఇదిపవిత్ర మంత్రముల బ్రేమించువాడును, ఇంద్రస్వరూపుడునగు భగవంతుని నుద్దేశించికావచ్చును. లేదా, నిరంతర సంగీత ప్రియుడును, స్తోత్రములకుప్పొంగు వాడును. ప్రేమింపబడుటను ప్రేమించువాడునైన కావచ్చును. 'అతడు' అనుపదమునకు 'ఆమె'యనికూడ ('He' includes 'she') అర్థాహరించినచో 'గిర్వణః' యనుపదమును, వధువనియు, భగవానుడనియు కూడ అన్వయించవచ్చును.

అటుపిమ్మట వరుడు వధువు నడుముచుట్టును కుశలతో చేయబడిన త్రాడుతో కట్టెడి 'యోక్త్రబంధనము" (లేక ధారణము) జరుగును. కాని, మౌలిక గృహ్యసూత్రముల ననుసరించి వధువుచే నూత్నవస్త్రములు ధరింపజేసిన యనంతరము మంగళసూత్ర ధారణ జరుగువలయును (ఆచ్ఛాద్య నూతనం వాసో, వరో మాంగల్య సూత్రకం హిరణ్యమణి సంయుక్తం బధ్నీయాత్ కన్యకాగళే).

'బన్దనమ్' అనుటతో యువ వధూవరులమధ్య బంధనమేర్పడుట సూచింపబడుటచే," వివాహప్రక్రియ నడుపు పురోహితుని వివేచనతో "మంగళసూత్రధారణమో, లేక "యోక్త్రబంధనమో" - ఏదిముందుగ జరుగవలెనో నిర్ణయింపబడుటయుక్తము.

—000—

# VII

# మంగళ సూత్రము

శ్రేయోదాయకమైన త్రాడుగా చెప్పబడు నీ కంఠాభరణము హిందూవివాహ సంస్కారమున నత్యంతము స్పర్శనీయమైనది.

మంగళసూత్రము తలంబ్రాల బియ్యపు బళ్లెమున నుంచి వేదికవద్దకు కొనిరాబడును అంతట ఆ మంగళసూత్రమును వివాహవేదికగల పందిరిలోనున్న ముత్తైదువుల కంఠములకు వారి ఆశీర్వాదము కాంక్షించి అనించి కొనితేబడును.

మంగళసూత్రమును వధువుకంఠమున గట్టుటకు ముందు వరుడు (మాంగల్యపూజ-ప్రాణాయామ సహితముగ) మంగళ దేవతను "మాంగల్యదేవతాముద్దిశ్య, మాంగల్య దేవతా ప్రీత్యర్థం, మాంగల్యదేవతాపూజాం కరిష్యే" అనుమాటలు చెప్పుచు ఆరాధించును.

ఈ ఆరాధనము షోడశోపచార సహితమై యుండును (సాంప్రదాయికమైన షోడశ పవిత్రీకరణ ప్రార్థనాదికము).

ఆ వెనుక వరుడు మంగళసూత్రాభరణమును వధువు కంఠమునకు ఈ మాటలుచెప్పుచు (కంఠము వెనుకవైపు) ముమ్మారు ముడులు వేయును.

"మాంగల్యతంతునానేన, మమజీవనహేతునా
కంఠే బధ్నామి, సుభగే, త్వం జీవ శరదశ్శతమ్"

(ఓ పావనమైనదానా! నేను నీ కంఠమున ని మంగళ సూత్రమును, నా జీవన కారణమైన దానిని, కట్టుచున్నాను. నీవు నూఱేండ్లు జీవింపుము)

ఈ మాటలలో మనస్సున బాగుగ నాటుమాటలు 'జీవన హేతునా' అనునవి. ఈ బాహిరమైన సూత్రమును, అభరణమును అతని జీవన కారణములు కావు. కాని, ఆ సూత్రము ఆ పురుషుని, ఆ స్త్రీని, శారీరకముగనేకాక హృదయపూర్వకముగ మానసికముగ, ఆధ్యాత్మికముగ నొకటి చేయుటను సూచించుచిహ్నమైయున్నది. నిజమునకు, మనుష్యుని జీవనమును సార్థకము చేయునది భార్యయే అనవచ్చును.



# VIII

# యోక్త్రబంధనము

వధువు నడుముచుట్టును యోక్త్ర (దర్భలతో చేసినత్రాడు) కట్టుసమయమున నింతకు పూర్వము తెలుపబడినట్లు దీర్ఘాయువు, శుద్ధబుద్ధియు, విశాలహృదయము, అర్హసంతానమునీయు దేహమును వాంఛించుటను ధ్రువపరచు మంత్రము చదువబడును.

"ఆశాసానా సౌమనసం ప్రజాం సౌభాగ్యం తనుం
అగ్నేరనువ్రతా భూత్వా సంనహ్యే సుకృతాయ కమ్"

యోక్త్రము కట్టునపుడు వేయు ముడి వధువు బొడ్డున కుత్తరముగానుండి, ముడివేసినతర్వాత యది వధువు బొడ్డునకు దక్షిణమునకు మార్చబడును. ఈ ప్రక్రియ వధూవరుల అన్యోన్యాకర్షణకు వివాహబంధమును, ఉత్పాదకశక్తిని దృఢీకరించును.

ఇప్పుడు వివాహప్రక్రియలో అత్యాకర్షకమైన (పెండ్లిచూడ వచ్చినవారి దృక్పథమునను సరించి) ఘట్టము, "తలంబ్రాలు" వచ్చును.

పూర్వమీవిధానము కేవలమాచారముగ మాత్రముండెడిది. 'తతః అర్ద్రాక్షతారోపణం కుర్యాత్' (అటుపిమ్మట-అనగా యోక్త్ర బంధనమైన వెనుక-తడిసిన బియ్యమును వధూవరుల శిరస్సులపై నుంచుట జరిగెడిది). కాలక్రమముననిది వధూవరులకు ప్రీతి

పాత్రమై ఒకరి శిరస్సుపై మరొకరు చల్లుకొనుట, చూపఱకు ఉత్సాహజనకమగుట. ఆ వెనుక వధూవరులలో ఆ తలంబ్రాలు చలుకొనుటలో ఉత్సాహముతో నిండిన ఒక విధమగు పోటీగాకూడ పరిణమించినది.

అదే సమయమున నా సందర్భమున ఐఠింపబడు వేదవాక్కులును వధూవరుల కన్యోన్యాకర్షణ ప్రేరకములై విషయాసక్తిని కలుగుజేయునవిగానున్నవి.

(శాంతి సౌభాగ్యములకై ఆశీర్వాదములిచ్చిన వెనుక సమృద్ధినెంచి కపిలధేను స్మరణము జరుగబడును).

"ప్రజాపతిః స్త్రియాం యశః ముష్కయోరదధాత్ సపమ్, కామస్య తృప్తిమానన్దమ్". (కామతృప్త్యనంతరము స్త్రీయందు పురుషవీర్యము నిక్షిప్తమొనర్చుట గలుగునానందము ప్రజాపతి నిర్దేశము).

"యథాహమస్యాః అతృపమ్ స్త్రియై పుమాన్ యథా స్త్రీ తృప్యతి పుగ్ంసిప్రియేప్రియా"

(తానాస్త్రీయందెట్లు ఆనందించినట్లు పురుషుడు చెప్పునో ప్రియురాలు తనప్రియునితో అట్లేఆనందించును) అగ్నిభట్టారకుడు కూడ తానీయజ్ఞక్రియతో తృప్తుడ నైతినని చెప్పును.

హైందవకర్మ కాండలో వివాహప్రక్రియకూడ నొకయజ్ఞముగ భావింపబడినట్లు చదువరి గుర్తింపవలయును. వధూ

వరుల అన్యోన్య భౌతికానందమునుగూర్చి చెప్పునపుడు శాస్త్రమున వాయు సూర్య చంద్రాదులుకూడ చేరి వధూవరుల నాశీర్వదింతురని చెప్పబడినది.

ప్రథమమున బియ్యమునుంచుచు వరుడిట్లనును' "ప్రజా మే కామస్సమృధ్యతామ్" (నాకోర్కె ఫలితముగ జనించు సంతతి వృద్ధినినుగాంచుగాత!)

పిమ్మట వధువు "పశవో మే కామస్సమృధ్యతామ్" (పశువులు నాకు సమృద్ధిని కూర్చుగాత) అని అనును.

మఱలవరుడు 'యజ్ఞో మే కామస్సమృధ్యతామ్" (ఈ వివాహ యజ్ఞము నా కోర్కెలు తీర్చుగాత) అనును.

పిమ్మట వధూవరులు ఒండొరుల శీర్షములపై బియ్యము పోసికొందురు. నాల్గవతడవనుండి మాటలు లేకయే అన్యోన్యము ఒకేసారిగా బియ్యముపోసికొందురు ("తూష్ణీం చతుర్థే అన్యోన్యమ్ యుగపత్".)

"శ్రియో మే కామస్సమృధ్యతామ్" (లక్ష్మీదేవత మాకు వలసిన సంపదలు-ధర్మబద్ధమైన కోర్కెలు తీర్చుకొనుటకు- ఇచ్చుగాత).

ఇంతవరకు దోసెడు బియ్యము మాత్రమే శాస్త్రీయముగ అన్యోన్యము జల్లుకొనుట జరుగును.

ఈనాడు పూర్వాచారపరాయణులు కొందఱు ముద్రించు శుభలేఖలలో గోచరించు ఆశీఃప్రదశ్లోకము "జానక్యాః కమలాం జలిపుటే..."యొక్క భావము గుర్తించి తీసికొనివచ్చు తలంబ్రాల బియ్యమునకు కొంచెము కుంకుమను పుణ్యస్త్రీలు అద్దు ఆచారము కలదు. – భగవతి సీత ఉపయోగించిన పద్మరాగముల పోలుటకు. వధూవరులు నిరభ్యంతరముగ పళ్లెములలోని బియ్యము పూర్తియగువరకు చల్లుకొందురు, తదుపరి.

(మనవారు కొందఱు తలంబ్రాలకు పసుపుతోకలిపిన అక్షతలనే ఉపయోగింతురు. కాని, మఱికొందఱు ఆ తలంబ్రాలు బియ్యము విశ్వాసపాత్రులగు తమ సేవక జనులు ఉపయోగించుకొనుటకు వీలుగ పసుపు కలపకయే వాడుదురు).



# IX

## రక్షా బంధనము

పసుపుకుంకమలు పూసినదారము ప్రసిద్ధిగాంచిన (ఉత్త రాదిని సోదరుని చేతికి సోదరి కట్టునటువంటి దానిని) రక్షాబంధనమును ఇచ్చుటి ఆచారము ప్రకారము పురోహితుడు వధూ వరుల చేతులకు కట్టును.

లాంఛనప్రాయముగా వరుడు "ఆవయోః రక్షాబంధనం కరిష్యే" (మా ఉభయులరక్షణార్థ మీదారము కట్టుచున్నాను అని చెప్పును.

అపిమ్మట ఈ దిగువ మంత్రము పఠించుచు పురోహితుడు వరునికుడిచేతికి రక్షాబంధన సూత్రము కట్టును.

"విశ్వేత్తా తే సవనేషు ప్రవాచ్యా, యా, చకర్థ మఘవన్ ఇంద్ర సున్వతే, పారావతం యత్ పురు సంభృతం వసు, అపావృణోః శరభాయఋషిబంధవే. (ఓ ఇంద్ర! నీకు ప్రీతికరమైన సోమరసము నీకిచ్చిన శరభర్షికి రక్షాబంధన మిచ్చితివి. (వరునకు భగవానుడు ఆ విధమగు రక్షణమీయవలెనని ఆశయము).

వధువు యెడను చేతికి ఈ దిగువ మంత్రముతో రక్షా బంధనము చేయబడును.

"బృహత్సామ క్షత్రభృత్ వృద్ధ వృష్ణియం
త్రిష్టుభౌజః సుభితమ్ ఉగ్రవీరమ్

ఇంద్ర స్తోమేన పంచదశేన మధ్యమిదం
వాతేన సగరేణ రక్ష"

(ఇంద్రుడ! మాకు బృహత్సామ మంత్రముతో ధైర్యశాలురగు సంతతి కల్గించి, పదునైదవ మంత్రముతో శౌర్యమును; తేజస్సును వృద్ధిచేయు 'సగరవాత' మంత్రముతోనూ రక్షింపుము).

ఈ రక్షాబంధనము వివాహదినము రాత్రి చతుర్థయామమున తొలగింపబడును.



# XI

# వివాహ ప్రధాన హోమము

మొదట వధువు కుడిచేతిని తన కుడి చేతితో పట్టుకొని వరుడు ఈ దిగువ మంత్రము చెప్పుచు పవిత్రాగ్ని వద్దకువచ్చును.

"పూషా త్వేతో నయతు హస్తగృహ్య అశ్వినౌ త్వా
ప్రవహతాగ్ం రథేన
గృహాన్ గచ్ఛ గృహపత్నీ యథా అసః వశినీ త్వం
విదథమ్ ఆవదాసి"

(పూషణుడు- సూర్యభగవానుని ఒక రూపము - నీ చేతిని బట్టి దారిచూపును. అశ్వినీ దేవత లిద్దఱును వారి రథములతో నిన్ను అనుసరింతురుగాక. నీవు నీ నూత్నగృహమునకు పత్నిగాపోయి ఆ కుటుంబమునకు పాలకురాలివిగా చరింపుము)

సాధారణముగా నేటి కాలమున భారతదేశములో భార్య యొక గృహోపకరణముగ భావింపబడునట్లు గాక, వేదకాలమున భార్య ఇంటికి రాణిగా భావింపబడెడిది)

ఈ మాట చెప్పిన వెనుక మఱేమియు చెప్పక వరుడు వధువు చేతిని పవిత్రాగ్ని కడ క్షణకాలము పట్టుకొనును. ఆ వెనుక వధూవరు లిరువురు మఱల అగ్నిని ప్రజ్వలింపజేయుదురు.

—0—

# XII

## అగ్ని ప్రతిష్ఠ

అగ్నిసాక్షికముగ జరుగవలసిన అన్ని ఆహుతులను వధూ వరులిరువురును గావింతురు. 'ఓం భూర్భువస్సువరోమ్' అని చెప్పుచు అగ్నిని ప్రజ్వాలింప జేయుదురు. ఇచట అగ్నిభట్టార కుడు నాల్గువేదములకును ప్రతీక. (చత్వారి శృఙ్గాః అస్య – ఆయనకు నాల్గుశృంగములు, నాల్గు వేదములకు ప్రతీకలుగ, గలవు.)

శాస్త్రప్రకారము ఆహుతులొసగిన పిదప వధువు సాహాయ్య ముతో అదితిని, సరస్వతిని గూడ సవితృ దేవతతో సహా అగ్ని సహచరులుగ ప్రార్థించుట జరుగును. వరుడు వధువు నీ విధ ముగ ఆహ్వానించును.

సోమః ప్రథమో వివిదే; గంధర్వో వివిదే ఉత్తరః
తృతీయో అగ్నిష్టే పతిస్తురీయస్తే మనుష్యజాః"

(ముందుగ సోముడు–చంద్రుడు–కన్యా యౌవన ప్రాదు ర్భావ ప్రేరక శక్తిగను, పిదప గంధర్వుడు [సంగీతజ్ఞుడు] కన్యకు యౌవన శోభాదాతగను, ఆ వెనుక అగ్ని [వాంఛాప్రేరకుడు] కన్యకు మాతృస్థాన ప్రదాతగను, నిలిచి చివరకు భర్తృ సాన్ని ధ్యము చేర్చి, సంతానవతిగ జేయుదురు)

ఇచ్చట ప్రస్తుతకాలమున సరిగా అనుసరింపబడని సూత్ర కార వచనమొకటికలదు. 'అథ అస్యై దక్షిణేన నీచా హస్తేన...

# X

## బ్రహ్మముడి

"అగ్నే విశ్వేభిః" ఇతి బ్రహ్మగ్రంథిం కుర్యాత్.

పూర్వుల బోధన ప్రకారము 'అగ్నే విశ్వే భిః' అను మంత్రము పఠించుచు వరుని ధోవతి కొనకును, వధువు చీర కొంగు కొనకును 'బ్రహ్మముడి'యను ముడిని వేయుట ఆచారమై యుండగా ప్రస్తుతకాలమున ఈ దిగువ మంత్రము పఠించుట ఆచారమైనది.

"యోగక్షేమస్య క్లృప్త్యై యుక్తం క్రియతే
ఆశీః కామే యుజ్యాతా ఇతి
ఆశిషః సమృద్ధ్యై గ్రన్థింగ్రథ్నాతి..."

(ఆశీస్సులు పొందుటకును, సంపత్సమృద్ధినిలుచుటకును, ఆశీస్సులు ఫలించుటకును ఈ గ్రంథి కట్టబడినది.)

"ప్రజాయతే ప్రజయా పశుభిః యజమానః
అథో అర్ధోవా ఏష ఆత్మనః యత్ పత్నీ...
యజ్ఞమ్ ఏవ తత్ మిథునీకరోతి"

(యజ్ఞముగావించు యజమాని పశుసంపదతోను, సంతతితోను అభివృద్ధి చెందును. ఆ ప్రక్రియలో ఆతనిభార్య ఆ యత్నమున సగము పొందును. ఆమె ఆతని అర్ధాంగి. వాస్తవమునకు, పురుషుని స్త్రీని కలుపునది యజ్ఞమే.) "దేవయజ్యాయై నిర్వపామి" (ఈ దేవయజ్ఞ ప్రభావము కొఱకై నేను హవిస్సునర్పించెదను).

మనుష్యుడు తన తండ్రివలె ఈ మాదిరిగా భగవంతుని ప్రార్థించిన వెనుక, హైందవ సంస్కారక్రియానంతరము వచ్చు సాధారణమైన ఆశీర్వచనమునకు పిలుపువచ్చును

"యోవై తాం బ్రహ్మణో వేద, అమృతేనావృతాం పురీమ్
తస్మై బ్రహ్మచ, బ్రహ్మేచ, ఆయుః కీర్తిం ప్రజాం దదుః"

(ఎవడు బ్రహ్మము – అమృతానందసంధాయకమైన సత్త్వము–నెఱుగునో ఆతడు ఆయుఃకీర్తిసంపత్సంతతులు నిర్గుణ–సగుణద్వయాత్మక బ్రహ్మమునుండి పొందును).

వధూవరులకా సమయమున ముత్తైదువులు కర్పూరమంగళ హారతి నొసగుదురు.

అప్పుడు వధువు చేతిని వరుడు గ్రహించు "పాణిగ్రహణ" శుభముహూర్తము – వివాహమునకు మారుమాటయైనది – జరుగును.



లోమాని గృహ్ణాతి' (ఆ వెనుకవపడు తెరచిచాపిన వధూహస్తాం గుళులు మాత్రము పట్టుకొనును వరుడు తనకు స్త్రీ సంతానము కావలెనని కోరినచో వధువు హస్తాంగుష్ఠము వదలి మిగిలిన వ్రేళ్లను స్పృశింపవలెను. తనకు పురుష సంతానము కావలెనని కోరినచో వధువు హస్తాంగుష్ఠమున రోమమయమగు భాగమును మాత్రమే స్పృశింపవలెను.)

అటు పిమ్మట నతడు "గృహ్ణామి" అనుమాటతో ప్రారంభింపబడు నీ దిగువ నాల్గుశ్లోక ద్విపదలను చదువును.

"గృహ్ణామి తే సుప్రజాస్త్వాయ హస్తం మయా పత్యా
జరదష్టిః యథాసః
భగో అర్యమా సవితా పురన్ధిః మహ్యంత్వా అదుః
గార్హపత్యాయ దేవాః
తే హ పూర్వే జనాసో యత్ర పూర్వవహో హితాః
మూర్ధన్వాన్ యత్ర సౌభవః పూర్వోదేవేభ్యః
ఆతపత్, సరస్వతి ప్రేవమవ సుభగె వాజినీవతి,
తాం త్వా విశ్వస్య భూతస్య ప్రగాయామసి అగ్రతః
య ఏతి ప్రదిశః సర్వాదిశోఽను పవమానః
హిరణ్యహస్త ఐరమ్మః స త్వా మన్మనసం కృణోతు"

(దేవతలు మనమిరువురము వృద్ధుల మగువఱకు సంతానము పొందుటకై నిన్ను నా కొసగిరి. ప్రథమమున సూర్య భగవానుడు గృహస్థాశ్రమమును శక్తిమంతము చేసెను పిదప చదువులదేవత సరస్వతి ఆద్యదైవములగు అగ్ని, వాయువుల సాహాయ్యమున నేడును, మున్ముందును నీవు నాకోరికలకు లోబడినదానివిగా చేసెను.)

హైందవ వివాహ విధానమున భగవానుడు,మనుష్యుడును భార్యాభర్తలవలెనే విడదీయరాని వారయియున్నారని వొక్కిచెప్పనవసరము లేదు.

# XIII

## సప్తపది

"అథఏనమ్ ఉత్తరేణ అగ్నిం దక్షిణేన పదా ప్రాచీం ఉదీచీం వా దిశం అభిప్రక్రమయతి (ఏకమిష ఇతి) సఖేతి సప్తమే పదే జపతి".

పిమ్మట వరుడు, వధువు నామె కుడిపాదము ముందుండు నటు తూర్పునకుగాని ఉత్తరమునకుగాని "ఏకమిషే..." అను మంత్రము చెప్పుచు అగ్నికి ప్రదక్షిణముగ నడిపించును ఏడవ అడుగు వేసినపుడు "సఖా సప్తపదా భవ" అను మంత్రమును చెప్పును.

ఏకమ్ ఇషే విష్ణుః త్వాఅన్వేతు; ద్వే ఊర్జే విష్ణుః... త్రీణివ్రతాయ..., చత్వారి మాయోభవాయ..., పంచ పశుభ్యః షట్ ఋతుభ్యః ...., సప్త సప్తభ్యో హోత్రాభ్యో..." (ఓనాప్రియ వధూ! సుఖసంతోషముల కొఱకు, మంచిఆహారము కొఱకు మహావిష్ణువు నిన్ను నీ మొదటిపాదమున నడిపించుగాక; రెండవపాదమున భౌతికశక్తి కొఱకును, మూడవ పాదమున చేసిన బాసలు చెల్లించుటకును, విధివిహిత ధర్మపాలనకు నాల్గవ పాదమున, పశుసంపదభివృద్ధికి అయిదవ పాదమున; తత్త్వాకాలిక లబ్ధికి ఆఱవ పాదమున; నీ యజ్ఞమున పురోహితులైన ఏడుగురు హోతల ఆశీస్సులకై ఏడవపాదమున; నడిపించునుగాక)

సఖా సప్తపదా భవ సఖ్యాయౌ సప్తపదా బభూవ సఖ్యంతే గమేయమ్, సఖ్యాత్ తే మాయోషమ్, సఖ్యాత్ మే మాయోష్ఠాః, సమయావ సంకల్పావహై సంప్రియౌ రోచిష్ణూ సమనస్యమానౌ

ఇషమ్ ఊర్జమ్ అభిసంవసానౌ సం నౌ మనాంసి సంవృతా సముచిత్తాన్యాకరమ్! సా త్వమసి (అము...) అహమస్మి, సా త్వం ద్యౌః అహమ్, పృథివీ త్వమ్, రేతః అహమ్ రేతోభృత్ త్వం మనః అహమ స్మి వాక్ త్వం, సామ అహం అస్మి ఋక్త్వం, సా మాం అనువ్రతా భవ, పుగ్ంసే పుత్రాయ వేత్త వై శ్రియై పుత్రాయ వేత్తవ ఏహి సూనృతే!

(రమ్యప్రియా! ఏడడుగులు నడచుటచే మన మిద్దరమును అన్యోన్యమవిభాజ్యముగ ప్రియులమైతిమి. మన మీ స్నేహ బంధము నెన్నడును విచ్ఛిన్నము చేయకుందుముగాక. మనో వాక్కాయ కర్మముల మనమెల్లప్పుడు నన్యోన్యమంకితులమై యుందుముగాక నీవు ఋక్కయిన నేను సామమై వేదము వర్ధించునట్లు వాగ్గీతములవలె కలిసియుందుము. నేను నాశక్తి పైనుండి రాల్చెదను. కావున ఆకాశప్రతిభుడను. నీవు దిగువనుండి నాశక్తిని గ్రహించెదవు కావున భూ సదృశవు. నేను రేతస్సును. నీవు దానిని ధరించుదానవు. నీవు పలుకయిన, నేను మనస్సును. కావున, నీవునాకు నిత్యము నిజమైన సహజ జీవన సహచారిణివై యోగ్య సంతానమును, సంపదలను కల్గించెదవు గాక.

ఇచట కవితకలదు. ఇచట వేదాంతము, సంగీతము తత్త్వవిచారములుకలవు. వాస్తవమునకు మానవ సాన్నిహిత్యము వలన నుండవలసిన వన్నియుకలవు. మన సంకల్పమే మన సౌభాగ్యమనుటకు గల సంపూర్ణ సాక్ష్యమిచ్చుటకలదు.

ఈ ఏడడుగులును ఈ భూమికి మాత్రమే పరిమితమైనవి కావు. అవి ఉత్సాహము, రామణీయకతలు నిండిన ఏడు ఊర్ధ్వ లోకములకు మర్త్యామర్త్య సుఖములతో దారిచూపు ఏడుమెట్లు వంటివి.

"సఖ్యం సాప్తపదీనమ్" అనునానుడి (ఏడడుగులు కలిసి నడిచిన స్నేహమేర్పడుననుట) ఈ 'సప్తపది' కార్యక్రమమును బట్టి వచ్చినది.



# XIV

# హోమము

ప్రధానహోమము జరుపుటకుముందు బ్రహ్మతో కూడిన అగ్నిభట్టారకునకు (సబ్రహ్మాణమగ్నిం) వధూవరులు ప్రదక్షిణింతురు.

'సోమాయ జనివిదేస్వాహా' (ఈ వధువును పవిత్రురాలునిగ జేసిన చంద్రదేవునకు అహుతు ర్పింతును.)

అదే విధముగ గంధర్వుని (పవిత్రకళలకధిదేవత) అగ్నిదేవుని (పారమార్థిక రూపమైన అగ్ని) ప్రార్థనా పూర్వకముగ పిలిచెదరు.

ఇప్పుడు వధువు తన పుట్టినింటినివదలి అత్తవారింటికి వెళ్లుచున్నది కావున దేవతా సమూహముల కధిపతియగు నింద్రుడు ఆమెను తనక్రొత్త విధులలో భక్తి విశ్వాసములు చూపి స్థిరముగ నిలుచునట్లు దీవనలీయవలెను

వధువు క్రొత్తగా గడించిన వైవాహిక సంబంధమైన తేజోవంతమైన స్థితిచే 'సూర్యా' అని పిలువబడును.

"ఇమాం త్వమ్ ఇంద్ర మీఢ్వః
సుపుత్రాగ్ం సుభగాం కృణు",

(సౌందర్యప్రదాతవగు ఇంద్ర! ఈ వధువు సుకుమారముగ సత్సంతానమును కాంచునుగాత.)

'ప్రజాం ముంచతు మృత్యుపాశాత్' (ఆమె సంతానము అకాలమృత్యు భయరహితమైయుండుగాత)

'ఇమామ్ అగ్నిః త్రాయతాం గార్హపత్యంః... అశూన్యా ఉపస్థా జీవతామస్తు' (గార్హపత్యాగ్ని ఆమెను రక్షించి వంధ్య కాని యామెను శక్తిమంతమైన సత్సంతానవతిగా చేయుగాత)

సాంకేతికముగ వధువు యొక్క వివిధ శరీరభాగముల రక్షణకు వివిధ దేవతలను ప్రార్థించుట జరుగును.

ఆకాశము ఆమెపిరుదులను, వాయువు ఆమెతొడలను, అశ్వినీ దేవతలు ఆమె స్తనములను, సూర్యుడు ఆమెస్తనంధయులను, బృహస్పతి ఆమెసత్త్వమును, మఱియు విశ్వే దేవతలు ఆమె వీపు భాగమును రక్షింతురని ప్రార్థించుట జరుగును.

చివరిగ జలాధి దేవతయగు వరుణుని ఆమెకు రక్షణ, సంపదలు కలుగుటకు ప్రార్థించుట జరుగును.

కట్టకడపట అగ్ని వరుణులను ప్రార్థించి, అంతవఱకు జరిపిన కార్యకలాపమంతయును వారివారి ఔన్నత్యమును స్తుతియించుటకేకాని, క్రియాకలాపములను జరిపిన కర్త వాంఛాపూర్తిని కాంక్షించి కాదని విశదము చేయుట జరుగును.

"అగ్నీ వరుణాభ్యా మిదం న మమ..."
(అన్నివిధములైన హోమములకును కట్టకడపట ఆ యాహోమముల నైవేద్యములును ఆయా దేవతలకు చెందునవే యనియు హోమము చేయుకర్త భౌతికాభివృద్ధి కాంక్షించి కాదనియు తెలుపుట జరుగును).

ఇపుడు హిందూ వివాహ కార్యక్రమమున మరొక (అపురూప) అర్థవంతమైన సాంకేతిక విశేషము జరుగును.

"అథ ఏనామ్ ఉత్తరేణాగ్నిం, దక్షిణేన పదా అశ్మానమ్ ఆ స్థాపయతి "ఆతిష్ఠ" ఇతి".

పిదప అగ్నికి ప్రదక్షిణించి, ఈ దిగువ మంత్రము ననుసరించి, ఒకరాతిని వధువు తనకాలితో త్రొక్కును.

"ఆతిష్ఠ ఇమామ్ అశ్మానం: అశ్మా ఇవ త్వగ్ం స్థిరాభవ"

(ఓ వధూ! ఈ రాతిని త్రొక్కి ఈ రాయివలె నీ శీల ప్రవర్తనములలో స్థిరముగ నుండుము.)

అపేవిధముగ ముందుజరుగు 'లాజహోమము' వధువు యొక్క అసంకల్పిత దుష్టచింతనలను భస్మీకరించుటను సూచించును.



# XV

# లాజ హోమము

పిమ్మట, పేలాలు వధువు దోసిలిలో (మఱియొక సంప్రదాయము ప్రకారము వధువు సోదరుడీకార్యము చేయును) నివేదనార్థముంచెదరు. ఆటుపిదప వరుడు కూడ హోమమును "దేవతీర్థ" విధానమున (వ్రేళ్లచివరల నుండి సమర్పించుచున్నట్లు) ఈ మాటలను చెప్పుచు చేయును:

"ఇయం నారీ ఉపబ్రూతే కుల్పాని ఆవపన్తికా
దీర్ఘాయురస్తు మే పతిః జీవాతు శరదః శతమ్"

(ఈ స్త్రీ తనభర్తకు శతాయుర్దాయము కోరుకొనుచు లాజలు హోమము చేయుచున్నది)

తనకంటె తనభర్త ఎక్కువకాలము జీవించవలెనని ప్రతి హైందవ స్త్రీయును కోరుకొనుననుట ఎల్లరకు తెలిసినదే.

మరిమూడు మంత్రములను చదివిన వెనుక, మఱల వధువు రాతిని (సన్నెకల్లును) త్రొక్కును.

"తుభ్యమ్ అగ్రే పర్యవహన్ సూర్యాం... పునః పతిభ్యః జాయాం దాః... విశ్వా... అతిగాహే మహి ద్విషః"

(ఓ అగ్నిదేవ! మొదట ఈ కన్య ఆమెతండ్రిచే నీకు సమర్పింపబడినది ఇప్పుడు నీ వామెను ఆమెభర్తకు భార్యగా ఇమ్ము. నీ దయచే భార్యాభర్తలుభయులు వారల ప్రతికూల శత్రులను జయించెదరు (

ఈ 'లాజహోమము'లోని అంతరార్థ మేమనగా వర్లయం దలి దోషములను పేలాలు నశింపజేయు విధముగా ఈ లాజ హోమము వధూవరుల సంతోషమునకు గల ఆటంకములను నశింప జేయవలయునని.

మఱియొకమారు అగ్నికి ప్రదక్షిణించి, తరువాత ఈ మంత్రపఠనముతో మఱల హోమము సాగును.

"త్వమ్ అర్యమా భవసి యత్ కనీనాం నామ స్వధానత్ స్వర్యం బిభర్షి అఞ్జన్తి వృక్షగ్ం సుధితమ్ న గోభిః యుత్
దమ్పతీ సమనసా కృణోషి".

(నీ కటాక్ష ప్రేరణచే నీవు ఈ వధూవరులకు స్వర్గసౌఖ్యములను పొందుటకు – ఇతర హోమాదుల అవసరము లేకుండగనే – భూమిపై వృక్షము జలసేచన మాత్రమున పెరుగు విధమున, శక్తినిచ్చితివి. నీ యౌదార్య పూర్వక వరములచే నీ వధూవరులు అన్యోన్య ప్రేమ విశ్వాసములతో వర్ధిల్లుదురుగాక.)

("ఉత్తరాభ్యాం యోక్త్రం విముచ్య"). ఈ మంత్రద్వయము పఠించుచు వధువు నడుమునకు కట్టిన బంధమును విప్పవలయును.

"ప్ర త్వా ముఞ్చామి వరుణస్యపాశాత్, యేన త్వా
అబధ్నాత్ సవితా సుకేతః ధాతుశ్చయోనౌ
సుకృతస్య లోకే స్యోనం తే సహపత్యా కరోమి".

(పూర్వమునుండి నిన్ను కట్టియున్న అజ్ఞానమను వరుణపాశము నుండి నేను నా వధువువైన నీకు విముక్తి కల్గించుచున్నాను. సూర్యభగవానుని శక్తిచేతను, సృష్టికర్త శక్తిచేతను నీ విప్పుడు నాతోకలిసి సంతోషానుభవము పొంద సమర్థురాలవైయున్నావు).

వధువు కన్యాత్వము నుండి విముక్తురాలైనదని దీనిభావము

# XVI

# ప్రవేశ హోమము

ఈ అగ్న్యారాధనము వరుడు తన ఇంటికి తిరిగి వచ్చిన పిదప జరుగును. (హైందవ వివాహము సాధారణముగ వధువు ఇంటివద్ద జరుగును). వరుని సంపూర్ణ గృహస్థునిగ (గార్హ పత్యాగ్న్యారాధకునిగ) చేయుటయే గాక, ఈ అగ్న్యారాధనము – బుద్ధి కుశలతను, ఆధ్యాత్మికౌన్నత్యమును గూర్చు చిహ్నమై యున్నది.

"అయమ్ అగ్నిః గృహపతిః సుసంగ్ సత్ పుష్టివర్ధనః
యథా భగస్య అభ్యామ్ దదత్ రయిం పుష్టిమ్
అథో ప్రజామ్".

(ఈ యగ్ని నాగృహమును రక్షించుగాక. వధూవరుల అన్యోన్యానందమును పెంచునుగాక. సత్సంతతినిచ్చుగాక. చుట్టు ప్రక్కలవారిలో సాంఘిక సమైక్యము గూర్చుగాత.)

ఇచ్చట చుట్టుప్రక్కల వారితో సంబంధ ప్రస్తావనకలదు. హైందవ ప్రార్థనలన్నియు విశ్వశాంతి కామనతో ముగియును: "లోకాః సమస్తాః సుఖినో భవన్తు" అని

పిమ్మట పురోహితుడును అచటికి చేరిన విప్రులును వధూవరుల నీ మాటలతో దీవించెదరు.

"ఇహైవస్తం మావియోష్టం విశ్వమాయుర్వ్యశ్నుతమ్
(మీరిరువురును ఈ మీగృహమున స్థిరపడుదురుగాక. విడిపడకుందురు గాక. మీరు అన్యోన్యతతో చిరకాలము సుఖముగ జీవించెదరుగాక )

"వివాహములుదైవ నిర్ణీతము"లను మాట ఏదియో నిగూఢ మైన సత్యమనుటయేకాదు. హైందవ భావనలోనిది అత్యంతము నమ్మికతో కూడియున్నదను విషయము నీమంత్రము రూఢిచేయు చున్నది.

"ధ్రువైధి పోష్యా మయి మహ్యం త్వాఽదాత్ బృహస్పతిః
మయాపత్యా ప్రజావతీ సజ్జీవ శరదః శతం
త్వష్టా జాయాం అజనయత్ త్వష్టా అస్యై త్వాం పతిం
త్వష్టా సహస్రమ్ ఆయూగ్ంషి దీర్ఘం ఆయుః కృణోతు వామ్"
("బృహస్పతి [ఇచట దేవగురువనికాదు. దైవమే అని]

సత్సంతానార్థము తనకు భార్యనొసంగెనుగాన ఆమె నూరేండ్లు జీవించుగాక" అని భర్త అనును. భగవానునిచే అన్యోన్యమొసంగ బడిన వధూవరులను పురోహితులు దీవింతురు).

నూతన వధూవరులకు వారిగృహమున పశుసంపద, సేవ కులు, ఐశ్వర్యము మున్నగునవి కలుగవలెనని ప్రార్థించిన వెనుక పురోహితుడీవిధముగ నాశీర్వదించును.

"ఇహప్రియం ప్రజాయాతే సమృధ్యతాం
అస్మిన్ గృహే గార్హపత్యాయ జాగృహి
ఏనా పత్యా తన్వగ్ం సగ్ంసృజస్వ
అథా జీవ్రీ విదథం అవదాసి".

(వధూవరులు తమ గృహమున సంగమించి, సంసారము చేసివైవాహికజీవితమును వంశము వృద్ధిచేయు కోరికతో సాగింప వలెనని పురోహితుడు చెప్పును).

"సుమంగలీః ఇయం వధూః ఇమాగ్ం సమేత పశ్యత
సౌభాగ్యమస్యై దత్వా యాథాస్తం విపరేతన."

(ఈ వధువిప్పుడు వైవాహిక జీవితమున కర్పింపబడినది. అత్యంత పావనత్వమునకు సిద్ధము చేయబడినది. ఆమె పవిత్ర తేజస్సు*ను గాంచి మీరు మీ ఇండ్లకు మరలుటకు ముందు ఆమెకు మీ ఆశీస్సుల నందజేయుడు

---

* 'తేజస్సు' – అగ్నిని ఆధ్యాత్మికోన్నతిని గుఱించి విశదీకరించును.

వేదమున "అగ్నిమిచ్ఛధ్వం భారతాః" అనగా, అంతరమైన నీలోని తేజస్సు పైకి చూడుము' అని – మంటపప్పుడును పైకిచూచును భారతునగా ఆధ్యాత్మిక తేజస్సు యందు సంతసించువారిని భావము. (భాయాం రతాః)

అగ్నిసాక్షియనుట భౌతికమైన కలయిక ఆధ్యాత్మికోన్నతి కయి పయనించుట యనిభావము

---

వివాహమహోత్సవమున నతి ముఖ్యమగు ఘట్టము చివర పురోహితునినుండియు, ఆహ్వానితులైన వారి నుండియు వధువు ఎట్టి ప్రత్యేక శ్రద్ధను పొందుచున్నదో గమనింపవలసియున్నది. రాజకీయమైన మార్పులు హైందవ సమాజమున కాలక్రమమున పురుషాధిక్యమును నెలకొల్పినను. ఆచారము, సంప్రదాయము నెప్పుడును స్త్రీకే ప్రథమ స్థానము నిచ్చియున్నది. మానవ మిథునమును గుఱించి ఎప్పుడు చెప్పినను 'వధూవరౌ' అనికాని, 'మాతాపితరౌ' అనికాని స్త్రీ కే ప్రథమస్థానమునిచ్చుట జరుగుచున్నది.

# XVII

# నక్షత్ర దర్శనము

నక్షత్ర మహా విస్ఫోటనా నంతరము చెదిరిపోయిన కొన్ని అణువులు నేటికిని విశ్వాంతరాళమున ప్రకంపనల రూపమున నిలిచియున్నట్లు అణు విజ్ఞానశాస్త్రము, జ్యోతిస్సిద్ధాంత శాస్త్రము, సామాన్య విజ్ఞాన శాస్త్రములు నేడు నిరూపించియున్నవి. కావున, ఆకాశమున నక్షత్రములును, భూమిపైని మానవులును, (అణుధార్మిక శక్తి రెంటిని కలుపునంత వరకు మాత్రము) రక్త సంబంధము కలిగినట్టి వారితో సమానులు.

కావున, వివాహ సంరంభము ముగింపు నక్షత్ర దర్శనము (ధ్రువ-అరుంధతీ నక్షత్రముల దర్శనముతో) జరుగును. అది ఆద్యంతరహితమైన వేద విజ్ఞాన సంపదను తెలియజేయును.

"ధ్రువ క్షితిః, ధ్రువయోనిః, ధ్రువమసి ధ్రువతః స్థితమ్
త్వం నక్షత్రాణాం మేధ్యసి సా మా పాహి పృతన్యతః"

(ధ్రువనక్షత్రమా! నీవు నాశన రహితవు, నిస్సందేహముగా సౌందర్యరాశివి, నక్షత్ర శక్తికి మూలకందమవు. నీవు నన్ను పోరాడుశత్రువులనుండి రక్షించెదవుగాక)

"సప్తర్షయః కృత్తికానమ్ అరుంధతీం యత్ ధ్రువతాగ్ం హనిన్యుః
షట్కృత్తికా ముఖ్యయోగం వహన్తీ యమస్మాకమ్ ఏధతు అష్టమీ"

ప్రసిద్ధమైన పౌరాణికగాథ ప్రకారము సప్తర్షులు తమ భార్యలలో వసిష్ఠుని భార్యయగు అరుంధతిని పరమ పవిత్రురాలిగా

గుర్తించిరి షట్కృత్తికలును ఆమెను ఆ విధముగా భావించిరి. కావున మేము ఈ వధువును ఏడుగురి పవిత్ర స్త్రీల తరువాత ఎనిమిదవ పవిత్ర స్త్రీగా భావించెదము.)

వధువయిన స్త్రీ, నక్షత్ర దర్శన సంరంభకాలమున ముఖ్య స్థానమును పొందుచున్నది

మానవుడు సంఘమునను, వైవాహిక జీవితమునకు ధ్రువ తారవలె నుండవలెను. స్త్రీ పవిత్రురాలై అరుంధతివలె నుండవలెను. ఈ సాంకేతిక భావన అత్యున్నతమగుట ప్రస్ఫుటము.

భార్య సమున్నత స్థానమును వేదము నిస్సందేహముగ చెప్పెను.

"జాయేదస్తమ్" (నిజముగ భార్యయే గృహము). తన క్రొత్త ఇంటికి వెళ్లుచున్న వధువును సంబోధించు విధము చూడుడు.

"సమ్రాజ్ఞీ శ్వశురే భవ
సమ్రాజ్ఞీ శ్వశ్రువాం భవ
ననాన్దరి సమ్రాజ్ఞీ భవ
సమ్రాజ్ఞీ అధిదేవృషు"
( నీవు-
నీ మామగారి ఎదుట
నీ అత్తగారి ఎదుట
నీ ఆడుబిడ్డల ఎదుట
నీ మఱదుల ఎదుట-రాణీవైయుండుము )

# XVIII

# ఆగ్నేయ స్థాలీపాకము

'స్థాలీపాకాన్తే వివాహః'-(స్థాలీపాక ఉత్సవముతో వివాహము ముగియును.)

వివాహమునకు సంబంధించిన ఉభయ వర్గముల అందుబాటునను్న సమయ-సంపదలనుబట్టి, ఆచార సంప్రదాయముల కారణముగా, దాంపత్య సంబధమైనవియు ఉత్సవ సంబంధమైనవియునగు పెక్కు వేడుకలు వివాహవిధానమున ముందు వెనుకగ చోటు చేసికొనెను. మన జని పోషణకు వంటముఖ్యమగుటచే పూర్వులు వివాహప్రక్రియలలో ఇంటిని దిద్దుకొనుటయు, ఇంటిపై శ్రద్ధచూపుటయును ఒకముఖ్యమైన కడపటి భాగముగ నేర్పరచిరి

వధువు ధాన్యమును దంచి బియ్యముగా చేయుటకు కావలసిన సంభారములను ఏర్పరచును. ఆమె గృహిణిగా మాఱుటకిది పరిచయము వంటిది

ఈ భాగమునకు సంబంధించిన హోమప్రక్రియలో చాల వఱకు ముచ్చటగనే తీసుకొనవలెను. ఏలయనగా ఇది ఆహుతులీయవలసిన విధానమును తెల్పును. సంపద్వృద్ధికై చేయు ప్రాజాపత్యహోమము ప్రకృతము.

"ప్రజాపతే నత్వదేతాని అన్యః విశ్వా జాతానిపరితా బభూవ।
యత్కామాః తే జుహుమః తన్నః అస్తు వయగ్గ్ స్యామ
పతయో రయీణామ్"॥

(ఓ ప్రజాపతీ! నీవు కాక మరెవ్వరూ నీసృష్టికి అంతర్వ్యాప్తమై లేరు. నీకిచ్చు మా అర్పణమైన ఆహుతులు మా మనోఽభీష్టములను తీర్చును. మేము సంపన్నులమగుదుముగాక)

ఎవరైనను ఈక్రియాకలాపమంతయు స్వార్థముతో నిండి యున్నదని యనుకొనకుండుటకు, సామాన్యముగా కృత్యములు ముగింపు చేయునప్పుడు ధ్రువముగా చెప్పునట్టి "ఈ క్రియాకలాపమంతయు భగవానుని కొఱకే. నా లబ్ధికి (మాత్రమే) కాదు" అనువాక్యముతో ముగియును అనగా భౌతికలాభము కర్తకు కలిగినను, అది "తనభక్తుల రక్షణము వహించు భగవంతుని ప్రేరణచే జరిగినది" అనుభావమును వ్యక్తీకరించుటయే.

మిగిలిన కార్యక్రమమంతయు పూర్వాచార పరాయణులగు కొందఱు హిందువులచే ఐదు దినములుగా జరుపు వివాహ ప్రక్రియగా నుండెడిది.

వైదిక నిర్ధారితమైన వివాహవిధానము కాలక్రమమున నాయా సమయముల నలవడిన ఆచారములు, వ్యవహారములతో జతపడి, మారుచువచ్చెనని మఱల చెప్పవలసి వచ్చినది

"అష్టవర్షా భవేత్కన్యా" (స్త్రీ శిశువు ఎనిమిది ఏండ్లు దాటిన పిదప వివాహయోగ్య యగును) అను వేదప్రతిపాదకము కాని వాక్యమునననుసరించి బ్రాహ్మణ వధువుల పూర్వ రజస్వాలా వివాహ పద్ధతి ప్రాచీన శాస్త్రకారులు కొందఱు ఆ నాటి విదేశీదండయాత్రలు, ఆ సమయములలో అవివాహిత స్త్రీలపై జరుగు సత్యాచారముల నరికట్టుట మున్నగు కొన్ని కారణములచే ఏర్పరుపబడెనే కాని, అవి వేదవిహితముకాదను విషయమిప్పుడు విశదీకరింపబడును.

"స్థాలీపాకా"నంతరము "గంధర్వస్థాపనము" అను కార్య క్రమమున 'విశ్వావసు' అనుగంధర్వుని 'షోడశోపచార పూజ'తో యథావిధిగ ప్రార్థించుట జరుగును. ఈ విధానమున వధూవరులను బ్రహ్మచర్య నిష్ఠపాటించ వలసినదిగను, భూశయనము చేయుడనియు తెల్పుదురు. (వధువు ఎనిమిదేండ్లదియేయైనచో 'బ్రహ్మచర్య'మని హెచ్చరించుట అసంగతము).

వివాహానంతరము నాల్గవదినమున జరపబడు 'శేష హెూమము"న 'విశ్వావసు'ని నారాధించుటతో అగ్నిని, వాయువును ఉద్దేశించి చెప్పబడు మంత్రములలో, నామంత్రార్థము గ్రహింపగల వధువు మానసికముగ తాత్కాలికముగ పడు క్షోభముతో కూడిన ప్రాయశ్చిత్తము కూడ తెలుపబడును.

వధూవరుల అన్యోన్య వీక్షణమును ప్రస్తావించు నీ దిగువ మంత్రములలో వధూవరుల యుక్త వయస్కులను విషయము ద్యోతకమగును.

"అపశ్యం త్వా మనసా చేకితానం తపసో
జాతం, తపసో విభూతమ్।
ఇహ ప్రజామ్, ఇహరయిగ్ం, రరాణః ప్రజాయస్వ
ప్రజయా పుత్రకామ"

(ఇందు యువతి యైన వధువు తనభర్తను, తనను పుత్రవతిగ జేయు సమర్థునిగను, తన నూత్నసంసారమున తనను పోషింప సమర్థునిగను భావించును)

వరుడు కూడ నదే అర్థమును సూచించు మంత్రముతో ప్రత్యుత్తరమిచ్చును.

"అపశ్యం త్వా మనసా దీధ్యానాగ్ం స్వాయాం తనూగ్ం
ఋత్వియే నాధమానామ్ ఉపమామ్ ఉచ్చా
యుపతిః బభూయః ప్రజాయస్వ ప్రజయా
పుత్రకామే".

(పుత్రార్థమై నాతో సంగమింపగోరు దానినిగా నేను నిన్ను భావించుచున్నాను.)

అదే సమయమున నీ ఫ్రష్ఠకమున ముఖ్యముగ తెలియజేయువిషయము (వధూవరుల శరీరములను విశ్వాత్మ నడిపించుననియు) ఋజువగును విశ్వేదేవాః (విశ్వే దేవతలును), వాయుదేవుడు, జలాధిదేవత, సృష్టికర్తయును, విద్యాధి దేవతయును వధూవరుల సంగమమును దీవించెదరనుట

"సమంజను విశ్వేదేవాః సమా హృదయాని నౌ
సం మాతరిశ్వా సంధాతా సముదేష్ట్రీ దిదేష్టు నౌ"

ఈ శేషహోమమున (కడపటిహోమమున) సాధారణముగ, "అశ్లీలము"గ భావింపబడు కొన్ని గర్భాధాన మంత్రముల విషయమైన దురభిప్రాయములను మనము దూరము చేసికొనుటకు వీలగును. అశ్లీలత అనారోగ్యకరములైన మనస్సులలో నున్నదియేకాని ఆరోగ్యపూర్ణమైన శరీరమున కాదు అను విషయము వైదిక భావన తెలుపుచున్నది "ప్రజాపతిః అమృతమ్ ఆనన్దః ఇతి ఉపస్థే" (సృష్టికార్య మెనర్చు నవయము – సంతతికి. శాశ్వతత్వమునకు, ఆనందమునకును స్థానమై, 'దైవీ సమాజ్ఞా' (దైవారాధనము)గా వర్ణింపబడినది.

శంకరభగవత్పాదులు – "బ్రహ్మైవ అనేనాత్మనా ఉపస్థే ప్రతిష్ఠితమ్" ("సృష్టికార్యము జరుపు నవయమున భగవానుడు ప్రతిబింబించు"నని) వ్యాఖ్యానించియున్నారు.

# XIX

# సహావేశనమ్

ఆత్మరక్షణము పిదప ఆత్మవ్యాపనము ప్రతి పురుషుని యొక్కయు, ప్రతి స్త్రీ యొక్కయు ముఖ్యమును, సహజమునైన కోరికయైయున్నది.

వధూవరుల శారీరక సంయోగమునకు పూర్వము చదువబడు మంత్రములు వారట యుక్తవయస్కులనియు, మంత్రార్థ సూచనలను పాటింపగల వారనుటకెట్టి సందేహమునకు తావీయవు.

ఇచట వివాహము ఎప్పుడు జరిగినది అనుటకంటె, ఎట్లు జరిగినదియనునది ముఖ్యము. శారీరక సంయోగము, నాకబలి (తెనుగున 'నాగవల్లి'గా అపభ్రంశమందిన పదము) యనబడు దేవతా సంబంధమైన యజ్ఞము సూచించి నిర్ధారించునట్లు మానసిక ప్రతిబోధముచే ప్రేరణము గాంచినది.

(వివాహ సందర్భముగ చేరిన స్త్రీలను, పిల్లలను అలరించుటకు వధూవరులొకరిపైనొకరు రంగుల పొడులు చల్లుకొనుట మొదలగు ఆటలు కేవలము కొన్ని ప్రాంతీయాచారములై తగవులు, కట్నాలు మున్నగు ప్రక్రియలతో నాకబలి వేడుకలుండును.)

నాకబలి ననుసరించి జరపబడు 'నీల లోహితధారణము', 'కంకణవిమోచనము'లు అంతర్నిహితమైన ఆధ్యాత్మిక భావనా చిహ్నములై జలపూర్ణ పాత్రమున నుంచిన వెండి, బంగారు నగలను వధూవరులు వేఱుచేయుటలో ద్యోతకమగును.

భగవద్దత్తములగు వస్తువులు భగవంతున కర్పించుటయను భావమును పురోహితుడు ఆభరణములపై నీరు చల్లి సూచించును.

'త్రింశత్కోటి దేవతాభ్యో నమః
ఇద మర్ఘ్యం సమర్పయామి"
(ముప్పదికోట్ల దేవతలకు నే నీ అర్ఘ్యమిచ్చుచున్నాను )

ఈ మాటలతో పురోహితుడు ప్రోలును (అలంకరింపబడిన యజ్ఞ వేదికను) పవిత్రీకరించును. ఆ వేదిక చుట్టును ముప్పది మూడు జ్యోతులను పట్టుకొని నలుగురు ముత్తయిదువులు తిరిగెదరు.

"అనేన మయాకృతేన ప్రాతరౌపాసన హోమేన
భగవాన్ సర్వాత్మకః శ్రీయజ్ఞేశ్వరః సుప్రీణాతు
యజ్ఞేశ్వరార్పణమస్తు"

(ఈ ఉదయప్రార్థనాయజ్ఞముతో యజ్ఞాధిపతి దైవము ప్రీతి చెందుగాత. ఇదియంతయు యజ్ఞేశ్వరునకు సమర్పితము)

* వివాహమొక యజ్ఞము. భగవానుడు యజ్ఞేశ్వరుడు భార్యాభర్తలు తమశారీరక సంయోగమను యజ్ఞముతో సర్వాంతర్యామి యగు యజ్ఞేశ్వరభగవానుని ఆధ్యాత్మికముగ సుతృప్తపరచుచున్నారు.

ఓం తత్సత్

* Spiritual communion through physical union is the inner meaning of Hindu wedding